**Results of Chandamama-Camlin Colouring Contest No. 3. (Telugu).**

*1st Prize :* K. Saraswathi, Vizianagaram *2nd Prize :* M. Suvarnalatha, Guntur. *3rd Prize :* B. Satyanarayana, Adoni. *4th Prize :* Stanley S. Choudhury, Nowrangpur. Lanka Srinivas, Visakhapatnam-Kandula, Vizianagaram. Ralingi S. Rao, Peddapuram. A. Chandra Mohan, P. O. Peddapuram. *Merit Certificates :* S. P. Krishna, Secunderabad. Syed Noor Ahmed, Guntakal. T. Sreenivas, Secunderabad. Kasthala Raj Sekhar, Narasaraopet. K. Sivarama Krishna Prasad, Naharipatnam. Ch. Koteswara Rao, Srikakulam. Seetala Venkataramana, Vijayawada. K. G. Baskaran, Arkonam. S. Shyam, Madras. A. Bhaskar Rao, Orissa.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

---

ఈ సంచిక నుంచి చందమామలో కొన్ని మార్పులు జరుగుతున్నాయి. ముందే ప్రకటించినట్టు చందమామ ధర రు. 1 25 కు పెంచడమయింది. దానితోబాటు చందమామ పేజీలు నాలుగు పెరుగుతున్నాయి.

ఈ సంచిక నుంచి ఫోటోవ్యాఖ్యల పోటీ బహుమతి రు. 25 లు చేసి, "కథాశీర్షిక పోటీ" అదనంగా ప్రవేశపెట్టుతున్నాము. దీనికి కూడా బహుమానం రు. 25.

ఈ మార్పులు పాఠకులకు ఆసక్తి కలిగిస్తాయని ఆశిస్తున్నాము.

---

సంపుటి 59 నవంబర్ '76 సంచిక 5

విడిప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00









అర్థేభ్యో హి వివృద్ధేభ్యః,
సంవృత్తేభ్య స్తత స్తతః
క్రియా స్సర్వాః ప్రవర్తంతే
పర్వతేభ్య ఇవాపగాః.

[నదులు పర్వతాలలోనే పుట్టిన విధంగా ధనం నుంచే ధర్మకార్యాలు వృద్ధిపొందుతున్నాయి.]

అర్థేన హి వియుక్తస్య
పురుష స్యాల్పతేజసః,
వ్యుచ్ఛిద్యంతే క్రియా స్సర్వా
గ్రీష్మే కుసరితో యథా. 2

[వేసవిలో చిన్న నదులు ఎండిపోయినట్టుగా ధనహీనుడికి తేజస్సు తరిగిపోయి, అతని ప్రయత్నాలు భగ్నమవుతాయి.]

సోయ మర్థం పరిత్యజ్య
సుఖకామ స్సుఖైధితః,
పాప మారభతే కర్తుం
తతో దోషః ప్రవర్తతే. 3

[ధనాన్ని వదులుకున్నవాడు సుఖాలు మరిగినవాడు కావటంచేత పాపాలు చెయ్యనారంభించి అధర్మం పాలవుతాడు.]



# మిత్రసాహస్రి

## 41

హిరణ్యకం (ఎలుక) మంథరకానికి దైవాధీనం కథ చెప్పి, ఇంకా ఇలా చెప్పుకుపోయింది:

బృహస్పతి చూడాకర్ణుడితో, "చూశావా, మిత్రమా? దీని ఆస్తి ఎప్పుడైతే పోయిందో, దాని శక్తి అప్పుడే పోయింది. నిశ్చింతగా నిద్రపో," అన్నాడు.

ఈ మాట విని నేను నీరుగారిపోయాను. ఎందుకంటే ఆ మాట నిజం. ఇల్లూ, సంపదా పోయాక ఎవరికైనా శక్తి అంతా పోతుంది. వెనకటిలాగా ఆ ఇంట్లో నాకు మంచి ఆహారం దొరుకుతుందన్న ఆశ పోయింది. నా అనుచరులు అసంతృప్తి చెంది, "మనకు తిండి సంపాదించ లేడు సరేగదా, తన తిండి కూడా తాను సంపాదించుకోలేడు, వీణ్ణి ఆశ్రయించి ఏం లాభం?" అనుకున్నారు.

నేను ఆ ప్రదేశం విడిచిపెట్టి దూరదేశం పోదామని నిశ్చయించాను. ఎందుకంటే అక్కడ నాకు గౌరవమూ ఉండదు; ఆత్మ గౌరవమూ ఉండదు. అందుచేత నేను నా పాత నివాసం వదిలేసి, ఒక అరణ్యం చేరాను. అక్కడ వలలో చిక్కుకున్న చిత్రగ్రీవం తటస్థపడింది. నేను అతన్ని విడిపించటం సంగతి నువు ముందే విన్నావు. ఆ తరవాత లఘుపతనకం నాతో స్నేహం చేసి, నన్ను ఇక్కడికి రమ్మన్నది. అతని వెంట నిన్ను చూడటానికి వచ్చాను.

మంథరకం ఈ కథ విని, "విచారించకు. సోమిలకుడనే సాలెవాడు విధిని ఎదిరించి పోరాడి, చివరకు జయించినట్టే నువూ జయిస్తావు," అన్నది.

"ఏమిటా కథ?" అని లఘుపతనకం అడిగింది.



మంధరకం విధిని జయించిన సాలెవాడి కథ ఇలా చెప్పింది:

సాలెవాడి కథ

సోమిలకుడు నిపుణుడైన సాలెవాడు. అతను అనేక రంగుల మేలివస్త్రాలు నేయగలడు. అతను నేసిన బట్టలు రాజులు ధరించదగినవిగా ఉండేవి. రకరకాల వస్త్రాలు నేయటంలో ఎంతో నైపుణ్యం ఉండి కూడా అతను ఏనాడూ తన తిండికీ, బట్టకూ మించి సంపాదించలేదు. మామూలు నేతగాళ్ళు, ముతకబట్టలు నేసేవాళ్ళు కూడా తన కన్న ఎక్కువ సంపాదిస్తూ, డబ్బులో ఓలలాడటం చూసి అతను తన భార్యతో, "ప్రియా, ముతక బట్టలు తప్ప నేయలేని వాళ్ళు కూడా బోలెడంత డబ్బు సంపాదిస్తూండగా నేను ఎంతో నైపుణ్యం ఉండీ, శ్రమ చేసీ కూడా చాలీచాలని సంపాదనతో బాధపడుతున్నాను. నాకు ఇంత అన్యాయం చేస్తున్న ఈ ఊరితో నా కేమిటి? ఎక్కడికైనా పోతాను," అన్నాడు.

దానికి అతని భార్య, "ప్రియుడా, ఇక్కడ నీకు దొరకని ఐశ్వర్యం ఇంకెక్కడో దొరుకుతుందనుకోవటం భ్రమ. ఇక్కడే ఉండి, ఎంత వస్తే అంతే రాసిపెట్టి ఉన్నదనుకుని తృప్తిపడు," అన్నది.

"ప్రియురాలా, నువు చెప్పేది సరి కాదు. విధి కూడా మన చర్యల ద్వారా తప్ప పనిచెయ్యలేదు. ఒక్క చెయ్యి మోగనట్టే, ప్రయత్నంతో కూడి ఉండని చర్య సఫలం కాదు. తినాలని రాసిపెట్టి ఉన్నా కూడా, చెయ్యి సహాయపడితే తప్ప లభించిన ఆహారం నోట్లోకి పోదు. లక్ష్మీదేవి కృషి గల పురుషసింహుణ్ణే కటాక్షిస్తుంది. - ప్రతిదీ విధికి అంటగట్టే వాళ్ళు పిరికివాళ్ళు. అందుచేత మనం విధిని విస్మరించి, శాయశక్తులా కృషి చేయాలి. నీకు సాధ్యమైన ప్రయత్నం చేసినా ఫలితం లేకపోతే అప్పుడు నిన్నెవరూ తప్పు పట్టరు. ఎందుకంటే నీ ప్రయత్న లోపం లేదు గనక! చేతలు

ప్రయత్నం వల్ల ఫలిస్తాయి గాని, గొంతెమ్మ కోరికల వల్ల కాదు. నిద్రపోయే సింహం నోట్లోకి మృగాలు ప్రవేశించవు. ప్రయత్నం లేకుండా ఏ కోరికా తీరదు. అందుచేత నేను ఎక్కడైనా పోతాను," అన్నాడు.

అతను వర్ధమానపురం వెళ్లాడు. అతను అక్కడ మూడేళ్ళపాటు కష్టపడి పనిచేసి, మూడువందల బంగారు కాసులు సంపాదించి స్వగ్రామానికి బయలుదేరాడు.

మధ్య దారిలో అతను ఒక మహారణ్యం దాటవలసి వచ్చింది. అరణ్యం దాటుతూండగా సూర్యుడు అస్తమించి, చీకట్లు కమ్మాయి. ఆ రాత్రి ముందుకు పోవటానికి భయపడి, సోమిలకుడు ఒక మర్రిచెట్టు ఎక్కి, విశాలమైన కొమ్మ మీద నిద్రపోయాడు.

ఆ నిద్రలో అతనికి ఒక కల వచ్చింది. అందులో ఇద్దరు వ్యక్తులు, రక్త నేత్రులు, కోపంగా వాదించుకుంటున్నారు.

అందులో ఒకడు రెండో వాడితో, "ఓ కర్తా, సోమిలకుడికి కనీస భృతికి మించి ఇయ్యటం గురించి నేను అభ్యంతరం చెప్పాను. లోగడ నువూ ఇచ్చావు కావు. కాని ఇప్పుడు అతనికి మూడు వందల కాసులు ఇచ్చావేమిటి?" అన్నాడు.

రెండోవాడు మొదటి వాడితో, "ఓ కర్మా, మనుషుల ప్రయత్నానికి తగిన విధంగా ఫలితం ఇయ్యటం నా ధర్మం. అతనికి అది రాసిపెట్టి ఉండకపోతే నువు తీసేసుకో," అన్నాడు.

ఈ మాట వింటూనే సోమిలకుడు నిద్రలేచి తన సంచీ చూసుకుంటే, అది ఖాళీగా ఉన్నది. "నా కష్టార్జితం ఇంత శీఘ్రంగా ఎలా మాయమయింది? నా శ్రమ అంతా వ్యర్థమై, చేతిలో చిల్లిగవ్వలేకుండా నాభార్యనూ, మిత్రులనూ ఎలా చూడను?" అని విచారించి అతను, అప్పటికప్పుడే బయలుదేరి వర్ధమానపురానికి తిరిగి వెళ్ళి, అమితమైన కృషితో ఒక్క ఏడాదిలోగా అయిదువందల బంగారు కాసులు సంపాదించాడు.



# 179. ప్రపంచంలోకెల్లా పెద్ద టెలిస్కోప్

ఉత్తర కాకసస్ ప్రాంతంలో కొత్తగా ఏర్పాటు చేసిన ఈ "రిఫ్లెక్టింగ్" టెలిస్కోప్ తాలూకు అద్దం వ్యాసం 6 మీటర్లు లేక 236 అంగుళాలు. (పాలోమార్ టెలిస్కోప్ అద్దం వ్యాసం 200 అంగుళాలు). మొత్తం టెలిస్కోప్ బరువు 850 టన్నులు. ఇది వెయ్యి కోట్ల కాంతి సంవత్సరాల దూరం చూడగలదు. ఈ టెలిస్కోప్ ఈ సంవత్సరమే పని ప్రారంభించింది.





# మాయాసరోవరం

## 11

[కనకాక్షరాజుగారి కుమారుణ్ణీ, కుమార్తెనూ అపహరించినవాడు మకరకేతు అని, జయశీలుడికి నమ్మకం కలిగింది. అతడికి ముందుగా చికిత్స చేయించి, రాజుగారి దగ్గిరకు తీసుకుపోదామనుకున్నాడు. కాని, దారిలో కొందరు బోయవాళ్ళు అతణ్ణి అటకాయించారు. ఆ సమయంలో పదిమంది అశ్వికులు వచ్చి అందరినీ చుట్టుముట్టారు. తరవాత—]

తమను చుట్టుముట్టిన అశ్వికులు రాజుగారి సైన్యంలోని వాళ్ళని జయశీలుడు గుర్తించాడు. వెంటనే అతడు ఎత్తిన కత్తిని దించి, వాళ్ళతో, "అదుగో, ఆ వింతఏనుగు మీద మొసలిఆకారంలో కనిపిస్తున్నవాడు కనకాక్షరాజుగారి బరిదీ. పారిపోకుండా చూడండి," అన్నాడు.

అశ్వికుల నాయకుడు మకరకేతునూ, అతడు ఎక్కి వున్న జలగ్రహాన్నీ పరీక్షగా చూసి, ఒక క్షణకాలం స్తంభించిపోయి, "వీడెవడు? రాక్షసుడా, ఏదైనా దుష్ట పిశాచమా?" అని అడిగాడు.

"అయ్యా, వాడు ఆ రెండూ కాదు. అట్లని వాడు ఫలానా జాతివాడని తేల్చి చెప్పటం కూడా కష్టమే." అన్నాడు జయశీలుడు.

ఇంతలో సిద్ధసాధకుడు, బోయ గణాచారిని, జయశీలుడి పట్టునుంచి తప్పించి,



కొంతదూరం తీసుకుపోయి నిలబెట్టి, విల్లంబులు ఎత్తిన బోయవాళ్ళతో, "ఒరే, అమాయకుల్లారా! వీడు నిజమైన కాళీ భక్తుడు కాడు; ఒట్టి కపటి. మహాకాళుడి భక్తుణ్ణయిన నేను, వీణ్ణి చూస్తూనే ఆ సంగతి గ్రహించాను. మీరు బాణాలను వీడిగుండెల్లో దూసుకుపోయేలా కొట్టండి," అన్నాడు.

సిద్ధసాధకుడి మాటలు విని బోయవాళ్ళందరూ భయకంపితులైపోయారు. పదిమంది రాజుగారి సైనికులు; నల్లని దుస్తులతో, పొడవాటి గడ్డంతో మాంత్రికుడిలా వున్న సాధకుడు; కత్తిపట్టి నిలబడిన జయశీలుడు—వీళ్ళందరినీ మించి వింతఏనుగు మీద కూర్చుని వున్న భయంకర రూపుడు!

ఇక తమకు అక్కడినుంచి ప్రాణాలతో పారిపోయే అవకాశం లేదనీ, తమను చుట్టుముట్టినవాళ్ళు బలవంతులనీ భావించిన ఒక బోయవాడు, తనతోటివాళ్ళతో, "ఒరే, యిప్పుడేంచేద్దామంటారు? ఈ మాంత్రికయ్య చెప్పినట్టు, మన గణాచారిని బాణాలతో కొడదామంటారా? అలాచెయ్యకపోతే మనందరికీ చావు తప్పనట్టున్నది," అన్నాడు.

"ఇంతమంది మన కోసం, మన జాతివాడొకడు చావటం న్యాయమైన మాటే! ఏం గణాచారయ్యా, బాణాలు కొట్టమంటావా?" అని అడిగాడొక బోయవాడు.

ఈ ప్రశ్న వింటూనే బోయ గణాచారి ప్రాణభయంతో గడగడలాడిపోతూ, జయశీలుడితో, "అయ్యా, నన్ను మా బోయ అమాయక వెధవల నుంచి రక్షించండి. బాణం దెబ్బలు, కత్తి దెబ్బలకన్న మహాబాధ కలిగిస్తవి!" అన్నాడు.

"చచ్చేందుకు బాణం దెబ్బయితేనేం, కత్తిపోటు అయితేనేం? ఇక ఆట్టే వాగక, కదలా మెదలక నిలబడు," అన్నాడు సిద్ధసాధకుడు కోపంగా.

బోయవాళ్ళు బాణాలు గురిచెయ్యబోయేంతలో జయశీలుడు ఆగమని

వాళ్ళను హెచ్చరించి, సిద్ధసాధకుడితో, "సాధకా, నువ్వు చెయ్యబోయే యీ మతిమాలిన పనేమిటి? నువ్వేమైనా రాజువా, మరణశిక్షలు విధించటానికి?" అన్నాడు కోపంగా.

జయశీలుడి కోపం చూసి సాధకుడు వెలవెలపోతూ, "ఇదంతా నిజం అనుకుంటున్నావా, జయశీలా? ఈ దొంగ గణాచారికి బుద్ధిగరిపేందుకు, యీ తమాషా చేశాను. రాజుగారి అశ్వికులు సమయానికి రాకపోతే, యీ సరికి మనమో, యీ బోయ గణాచారి జాతివాళ్ళో చావటం జరిగేది కదా?" అన్నాడు.

అప్పటివరకూ జరుగుతున్నదంతా ఆశ్చర్యపోతూ చూస్తున్న అశ్వికభటుల నాయకుడు, "అయ్యా, మీరేనా జయశీలుడు? మంత్రిగారు యీ దాపులనే వున్న కొండచెరువుపల్లె గ్రామంలో విడిది చేశారు. మీరు, రాజుగారి పిల్లల్ని ఎత్తుకుపోయినవాణ్ణి పట్టుకున్నట్టు నగరంలో తెలిసింది. మీ కోసం వెతుకుతూ యీ అరణ్యానికి వచ్చాం," అన్నాడు.

"ఆహా, అశ్వికభటనాయకా, చాలా భేషైన పనిచేశావు! నేనూ—అంటే సిద్ధసాధకుణ్ణి—ఈ జయశీలుడూ కలిసి యువరాజునూ, యువరాణినీ ఎత్తుకుపోయినవాణ్ణి అరణ్యమంతా గాలించి



పట్టుకున్నాం. వాడే వీడు! మనిషి వింతగా లేడా?" అన్నాడు సాధకుడు.

"వింతగాకాదు, భయోత్పాతం కలిగించేలా వున్నాడు. డొక్కలో, భుజం మీదా కత్తినీ, బాణాన్నీ ఆభరణంలా ధరించటం మాత్రం, నాకు ఆశ్చర్యం కలిగిస్తున్నది," అన్నాడు అశ్వికులనాయకుడు.

"అవి ఆభరణాలు కాదు, వాడి ప్రాణం తీయనున్న యములాళ్ళు! నేనూ, చరకాచారిగారూ వాడికి చికిత్సచేయాలనుకుంటున్నాం. మంత్రిగారు మా గ్రామంలోనే విడిదిచేశారని తెలిసి మహా సంతోషంగా వున్నది." అన్నాడు వీరనారాయుడు ఏనుగు చాటునుంచి వస్తూ.



జయశీలుడికి యిక అక్కడ కాలయాపన చెయ్యటం మంచిది కాదనిపించింది. తాను సాధ్యమైనంత త్వరగా, గ్రామానికి పోయి మంత్రి ధర్మమిత్రుడికి సంగతి సందర్భాలు చెప్పటం బావుంటుంది. రాజుగారి పిల్లలు అంతత్వరగా దొరికే అవకాశం లేదని మంత్రికి విన్నవించాలి. ముందు యీ మకరకేతు చావకుండా చూడాలి. వాడిద్వారామాత్రమే, యువరాజూ, యువరాణీ ఎక్కడ వున్నదీ తెలుసుకోవటం సాధ్యం అవుతుంది....

జయశీలుడు యిలా ఆలోచించి, మకరకేతుతో, '' కేతూ, యిక నీ కొచ్చిన ప్రాణభయం ఏమీలేదు. కనకాక్షరాజుగారే స్వయంగా, నీ ప్రాణాలు కాపాడేందుకు తన మంత్రిని పంపారు. అవసరం అయితే నీకు చికిత్స చేసేందుకు ఆయన నగరం నుంచి రాజవైద్యులను కూడా పంపగలరు. ఇక బయలుదేరదాం.'' అన్నాడు.

మకరకేతు పెద్దగా ఒకసారి మూలిగి, '' డొక్కలో దిగబడిపోయిన కత్తి కన్న భుజంలో గుచ్చుకున్న యీ బాణం ఎక్కువ బాధపెడుతున్నది. దీన్ని కొట్టిన బోయ దుర్మార్గుడు జలగ్రహం తొండం మీదే ప్రాణాలు వదిలినట్టున్నది. వాడిలో చలనం లేదు. వాణ్ణి దూరంగా విసిరి వేయించమంటారా ? '' అని అడిగాడు.

జయశీలుడు పోయి బోయ భీమన్న ముఖం కేసి పరీక్షగా చూశాడు. వాడు గాలి పీలుస్తున్న సూచన కుడా లేదు. భయంకొద్దీ వాడు గుండె ఆగి చచ్చాడేమో అన్న అనుమానం కలిగింది, జయశీలుడికి. అంతలో చరకాచారి అక్కడికి వచ్చి భీమన్న నాడి పరీక్షించి చూసి, '' జయశీల ప్రభో ! వీడింకా బతికే వున్నాడు. నాడి మందంగా కొట్టుకుంటున్నది. మొసలి ఆకారంవాడు చెప్పినట్టు, వీణ్ణి శవం కింద జమవేసి దూరంగా పారవేయటం హత్యతో సమానం.'' అన్నాడు.

'' ఆ మాట నిజమే ! కాని, మరి వీడిలో చలనం కలిగించటం ఎట్లా ? వీణ్ణి

యీ అరణ్యంలోనే. వాడి జాతివాళ్ళ పరంచేసి వెళ్ళటం మంచిది. వీణ్ణి కూడా గ్రామానికి ఎక్కడ మోసుకుపోగలం?'' అన్నాడు జయశీలుడు.

జయశీలుడు మాట ముగించేలోపలే సిద్ధసాధకుడు, బోయ భీమన్న చెవిలో, పెద్దగొంతుతో, ''ఒరే, భీమన్నా, యిక నిద్రలే! నువు కొట్టిన అడవికోడిని మంత్రి గారు, మొసలిఆకారంవాణ్ణుంచి తిరిగి యిప్పించారు. దాన్ని తీసుకుని మీ గణాచారి పారిపోతున్నాడు,'' అని, గట్టిగా చప్పట్లు చరిచాడు.

ఆ వెంటనే బోయ భీమన్న మెరుపు వేగంతో ఎగిరి, జలగ్రహం తొండం నుంచి కిందపడిలేచి, దాపులనున్న ఒక అశ్వికుడి చేతిలోంచి చప్పున ఈటె లాక్కుని, ''ఎక్కడ? ఆ దయ్యాలపోతు గణాచారెక్కడ? నా కోడి ఏమైంది?'' అంటూ దిక్కులు చూడసాగాడు.

సిద్ధసాధకుడు, భీమన్న భుజంతట్టి, ''ఒరే, భీమన్నా, నీకు దృష్టి సరీగా ఆనటంలేదా? ఇటు చూడు; ఆ కనబడే వాళ్ళెవరు? వాళ్ళ ముందు నిలబడిన వాడు మీ గణాచారేమో, కాస్త జాగ్రత్తగా చూడు మరి!'' అని హెచ్చరించాడు.

సాధకుడు యిలా చెప్పగానే భీమన్న, అంతదూరంలో నిలబడిన తన జాతివాళ్ళ కేసీ, వాళ్ళముందు భయంతో వణికిపోతూ నిలబడివున్న దయ్యాలపోతు గణాచారి కేసీ చూశాడు. వెంటనే వాడికి సిద్ధ






సాధకుడు చెప్పిన తన అడవికోడి మాట మరోసారి గుర్తుకొచ్చింది.

"మొసలిపిశాచంవాడు యిచ్చిన, నా కోడి ఎక్కడ? దాన్నెక్కడ దాచాడు గణాచారి? దాన్ని యివ్వకపోయాడో.... ఆకలి! ఆకలి!" అంటూ భీమన్న ఈటె ఎత్తి గణాచారి కేసి ఉరికాడు.

గణాచారి ఒక చావుకేకపెట్టి, "మన వాణ్ణి కుక్కుటపిశాచం పట్టింది. దానికి పిల్లి మంత్రం వేస్తేగాని, అది వదలదు. ముందు వాడి ఈటె దెబ్బ తప్పుకోవాలి. పరిగెత్తండి!" అంటూ వెనుదిరిగి పారిపోసాగాడు. వాడి వెంట తతిమ్మా బోయ వాళ్ళు కూడా పరుగు ప్రారంభించారు.

భీమన్న రౌద్రంగా అరుస్తూ, ఈటె ఎత్తి పట్టుకుని, వాళ్ళ వెంటపడ్డాడు.

"బతికిపోయాం, జయశీలా! శని విరగడ అయింది," అంటూ సిద్ధసాధకుడు పెద్దగా నవ్వాడు.

పారిపోతున్న బోయవాళ్ళ కేసీ, వెంట బడి తరుముతున్న భీమన్న కేసీ ఓ మారు చూసి, జయశీలుడు, "సాధకా, యీ గొడవ కంతా నువ్వే బాధ్యుడివి. అరణ్యంలో చిన్నా పెద్ద పిట్టల్నీ, జంతువుల్నీ కొట్టుకు బతికే ఆ బోయరామన్నకు, భీమన్న అన్న పెద్ద బిరుదు యిచ్చి, వాడిలో లేనిపోని అహానికి కారణం అయావు." అన్నాడు.

"జయశీలా, ఆ మాటా కొంత నిజమే! కాని యిప్పుడు ఆ మాయలమారి గణాచారికి, వాడు సరైన ప్రత్యర్థి. ఇక యిప్పట్లో వాళ్ళెవరూ పానకంలో పుడకల్లాగా మన కార్యసాధనకు అడ్డురారు," అన్నాడు సిద్ధసాధకుడు.

"అయ్యా, యిక బయలుదేరదామంటారా?" అన్నాడు అశ్వికుల నాయకుడు.

"అలాగే," అని జయశీలుడు, చరకాచారినీ, వీరనారాయుణ్ణీ దగ్గిరకు పిలిచి, "ఇక మీరు ముందుండి దారితీయండి. మంత్రిగారు మీ గ్రామంలోనే విడిది దిగారట," అన్నాడు.

"ఆయన ఊరి పక్కనవున్న కొండ చెరువు దగ్గిర గుడారం వేయించి, అందులో వున్నారు. తమరు అరణ్యంలో కనిపించితే, అక్కడికే తీసుకురమ్మన్నారు," అన్నాడు ఆశ్వికుల నాయకుడు.

జయశీలుడు, చరకాచారీ, వీరనారాయుళ్ళతో, "విన్నారా ?" అన్నాడు.

"ఆఁ, వినకేం జయశీల ప్రభో! ఈ మొసలితొడుగు ధరించినవాడికి, ఆ శ్రీ మంత్రిగారి సమక్షంలోనే శస్త్రం చేసి, భేష్ అనిపించుకుంటాం," అన్నాడు చరకాచారి.

"అవును, చరకాచారిగారూ. ఆ విధంగా మనకు కనకాక్షరాజుగారి కొలువులో వైద్యాచార్య పదవులు దొరికే అవకాశం వుంది. ఏమంటారు ?" అన్నాడు వీరనారాయుడు ఆశ్చర్యసంభ్రమాలతో.

"ఆచార్య పదవులేమోగాని, శస్త్రంచేసి యీ మకరకేతును మీరు ప్రాణాపాయం నుంచి కాపాడలేకపోతే, మంత్రిగారే మిమ్మల్నిద్దర్నీ, ఆ చెరువుగట్టునే తల నరికించేస్తారు!" అన్నాడు జయశీలుడు.

"ఆ పని మంత్రిగారు నాకు ఒప్పచెప్పితే, వీళ్ళిద్దర్నీ సమంత్రకంగా మహాకాలుడికి బలిపెడతాను. అందువల్ల మనకే కాక, లోకానిక్కూడా ఎంతోమేలు జరుగుతుంది, జయశీలా!" అన్నాడు సిద్ధసాధకుడు ఆవేశపడిపోతూ.

"ఇక మాటలు కట్టిపెట్టి కదలండి." అన్నాడు జయశీలుడు.



ఒక అరగంటకాలం గడిచేలోపలే అందరూ కొండచెరువు గట్టున వున్న మంత్రిగారి గుడారాన్ని సమీపించారు. మంత్రి ధర్మమిత్రుడు అందరికేసీ ఓమారు చూసి, జయశీలుడితో సాదరంగా, "రాజుగారి పిల్లల్ని అపహరించినవాణ్ణి పట్టినందుకు నిన్ను అభినందిస్తున్నాను. ఆ దుర్మార్గుడు వాళ్ళను ఎక్కడ దాచాడు?" అన్నాడు.

జయశీలుడు, మంత్రికి అన్ని విషయాలూ చెప్పి, "అయ్యా, వీడికి ముందు శస్త్రంచేసి, ఆ కత్తినీ, బాణాన్నీ బయిటికి లాగి, గాయాలు మానిన తరవాత ప్రశ్నించటం బావుంటుంది," అన్నాడు.

"అలాగేచేద్దాం. అప్పుడు నిజం చెప్పకపోతే, యీ మొసలిముచ్చును ఏనుగుల చేత తొక్కించి మరీ చంపిస్తాను," అన్నాడు మంత్రి ధర్మమిత్రుడు.

ఈ సంభాషణంతా జాగ్రత్తగా వింటున్న మకరకేతు, "జయశీలా! జలగ్రహం నీరు తాగి చాలారోజులైంది. ఈ పెద చెరువులో దింపి, దాని దాహం తీర్చుతాను," అన్నాడు.

"అలాగేచెయ్యి. కాని నేనూ, సాధకుడూ కూడా నీ పక్కనే జలగ్రహం మీద వుంటాం. అలాకాకపోతే, నువ్వు ఏదైనా మోసంచేసే అవకాశం వున్నది," అంటూ జయశీలుడు పోయి, జలగ్రహం మీద నిలబడ్డాడు. సిద్ధసాధకుడు కూడా చప్పున పోయి అతడి పక్కన నిలబడ్డాడు.

మకరకేతు, జలగ్రహాన్ని అదిలించి చెరువులో దింపి, దాన్ని బాగా లోపలికి తీసుకుపోయి, "జయశీలా, నాకు చావు ఎలానూ తప్పనట్టున్నది. అది గాయాలు మానిన తరవాత నైతేనేం, ముందుగా నయితేనేం?" అని ఒకక్షణం ఆగి, పెద్ద గొంతుతో, "హాఁ, మాయాసరోవరేశ్వరా!" అంటూ కేకపెట్టి, "జలగ్రహా! నీట మునిగి దారితియ్యి!" అన్నాడు.

వెంటనే జలగ్రహం, జయశీలుడూ, సిద్ధసాధకులతోపాటు చప్పున నీళ్ళలో మునిగింది. —(ఇంకా వుంది)





# సన్యాసిపక్షపాతం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువు ఎవరిపట్ల పక్షపాతబుద్ధి కలిగి ఇలా శ్రమ పడుతున్నావో తెలియదు, కాని ఇహ వాంఛలన్నీ వదిలేసి, ముక్కుమూసుకుని తపస్సు చేసుకునే మునులకే పక్షపాతం ఉంటుంది. అందుకు నిదర్శనంగా నీకు జ్ఞానశేఖరుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒకప్పుడు ధనవర్మా, ధీరవర్మా అనే రాజులు ఇరుగు పొరుగు రాజ్యాలను పాలించేవారు. రెండు రాజ్యాలకూ మధ్య ఉండే అరణ్యంలో జ్ఞానశేఖరుడు అనే ముని కుటీరం నిర్మించుకుని, తపస్సు

## బేతాళ కథలు



చేసుకుంటూ ఉండేవాడు. రెండు దేశాలకు చెందిన ప్రజలూ తమకు సమస్యలు ఏర్పడినప్పుడు ఆయన వద్దకు వచ్చి, ఆయనకు తమ కష్టాలు చెప్పుకుని, ఆయన సలహాలతో తమ సమస్యలు పరిష్కరించుకునేవారు.

ఒక సంవత్సరం వర్షాలు సరిగా కురవక, కరువు రాబోతున్న సూచనలు కనిపించాయి. కరువు నివారించటానికి ఏం చెయ్యాలో తెలుసుకునేందుకు ధనవర్మ, ధీరవర్మ ఒకేరోజున జ్ఞానశేఖరుడి వద్దకు వచ్చారు.

జ్ఞానశేఖరుడు వారు చెప్పినది విని, "నాయనలారా, మీ కిద్దరికీ చెరొక దంతపు పెట్టె ఇస్తాను. మీరు పరిష్కరించలేని అసాధారణ సమస్య ఎదురైనప్పుడు ఈ పెట్టెలను తెరిచి చూడండి. మీ సమస్యలకు ఏదో ఒక రూపంలో సమాధానం కనిపిస్తుంది. అయితే ఈ పెట్టెలు ఇచ్చే సహాయాన్ని ఎలా ఉపయోగించుకోవాలో మీ బుద్ధిబలంతో మీరే నిర్ణయించుకోవాలి. ప్రతి చిన్న సమస్య కోసమూ ఈ పెట్టెలను ఉపయోగించరాదు. ఇవి ఇచ్చే సహాయాన్ని దుర్వినియోగపరచరాదు. అందుకు విరుద్ధంగా జరిగినట్లు తోస్తే నేను ఈ పెట్టెలను తిరిగి తీసుకుంటాను. నేను కొంతకాలంపాటు సమాధిలోకి పోబోతున్నాను. నేను తిరిగి కళ్ళు తెరిచేదాకా ఎవరూ ధ్యానభంగం చెయ్యవద్దు." అన్నాడు.

ఇలా చెప్పి ఆయన రెండు దంతపు పెట్టెలను తీసి రాజులిద్దరికీ ఇచ్చి, కళ్ళు మూసుకుని సమాధిలోకి వెళ్ళిపోయాడు. రాజులు ఆ పెట్టెలను తీసుకుని తమ తమ రాజధానులకు తిరిగి వెళ్ళారు.

ధనవర్మ కరువు సమస్య గురించి ఏం చెయ్యాలని మంత్రులతోనూ, వర్తకులతోనూ చర్చించి ఏమీ పాలుపోక, జ్ఞానశేఖరుడిచ్చిన దంతపు పెట్టెను తెరిచి చూశాడు. అందులో నుంచి అంతులేని ధనం వచ్చింది. ఆ ధనంతో ఆయన

ఇతర దేశాల నుంచి ధాన్యం తెప్పించి, ప్రజలకు పంచి, కరువు బాధ లేకుండా చేశాడు. కరువు ఎప్పుడు వచ్చినదీ, ఎప్పుడు పోయినదీ ప్రజలు ఎరగరు !

కాని ధీరవర్మ అలా చెయ్యలేదు. కరువును ఎదుర్కొనటానికి అతనికి కొన్ని మార్గాలు తోచాయి. అవి ఫలించకపోతే దంతపు పెట్టెను అతను తెరిచి చూద్దామనుకున్నాడు. అతను ముందు దేశంలోని ధాన్యం దేశం దాటి పోకుండా జాగ్రత్తపడి, వర్తకుల వద్ద ఉన్న ధాన్యం అంతా తాను స్వాధీనం చేసుకున్నాడు. ఆ ధాన్యాన్ని అతను ప్రజలందరికీ పంచి పెట్టాడు. జనం కటకటపడిన మాట నిజమే గాని, ఆకలి చావులు మాత్రం కలగలేదు.

ధీరవర్మ కన్న తాను తన ప్రజలకు ఎక్కువ మేలు చేయగలిగినందుకు ధనవర్మ చాలా గర్వపడి, ''మన దేశాన్ని అన్ని దేశాలకన్నా ముందుకు నడిపించి, ప్రజలకు ఏ రాజూ చేయలేని సౌకర్యాలు కలిగించాలనుకుంటున్నాను. అందుకు ఏం చెయ్యాలి ?'' అని తన మంత్రులనూ, సలహాదార్లనూ అడిగాడు. జ్ఞానశేఖరుడి దంతపు పెట్టెను మరొకసారి తెరవమని వాళ్ళు సలహా ఇచ్చారు.

ధనవర్మ దంతపు పెట్టెను తెరిచి చూస్తే, అందులో ఒక చీటీ మాత్రమే



ఉన్నది. అందులో, ''వేచి చూడు,'' అని రాసి ఉన్నది.

ఇది జరిగిన కొద్ది రోజులకు ఖండాంతరం నుంచి ఒక జ్ఞాని ధనవర్మ దర్శనం చేసుకోవటానికి వచ్చి, ''మహారాజా, నా వద్ద ఒక యంత్రం ఉన్నది. దాని సహాయంతో నేను భూగర్భంలోని లోహ సంపదను తెలుసుకోగలను. నేను చెప్పిన చోట తవ్వితే మీకు నేను సూచించిన లోహాలు దొరుకుతాయి. ఆ విధంగా మీ దేశం సంపన్నం కాగలదు. అయితే నా సహాయంతో మీరు పైకి తీసే సంపద విలువలో సగం నాకు ఇయ్యవలసి ఉంటుంది,'' అన్నాడు.



అందుకు ధనవర్మ ఒప్పుకుని, జ్ఞాని సహాయంతో అంతులేని బంగారమూ, వెండీ, రాగీ, ఇనుమూ మొదలైన లోహాలు పైకి తీయించి, వాటి మూల్యంలో సగం జ్ఞానికి ఇచ్చి, ఆ లోహ సంపదతో తన దేశాన్ని చాలా ముందుకు తెచ్చాడు.

అది చూసి ధీరవర్మకు అతని మంత్రులు దంతపు పెట్టె సహాయంతో తమ దేశాన్ని కూడా పైకి తీసుకురమ్మని సలహా ఇచ్చారు. కాని ధీరవర్మ అందుకు ఒప్పుకోలేదు.

కొద్దిరోజులకు ఆ జ్ఞానే ధీరవర్మ వద్దకు వచ్చి, ధనవర్మకు చెప్పినట్టుగానే చెప్పాడు.

''మీ యంత్రాన్ని అమ్మితే కొంటాను. ధర చెప్పండి. మీ సహాయంతో మా దేశపు భూగర్భ సంపదను వెలికితీసి, అందులో మీకు సగం వాటా ఇయ్యటానికి ఎంత మాత్రమూ అంగీకరించను,'' అన్నాడు ధీరవర్మ జ్ఞానితో.

''ఈ యంత్రం ప్రపంచంలో నేను ఒక్కణ్ణే చెయ్యగలను. అందుచేత దీన్ని ఎవరికీ అమ్మే ప్రసక్తి లేదు. నా షరతులు నిరాకరించినందుకు, మీరు ఇతర మార్గాల భూగర్భసంపదను వెలికి తీయటానికి యాభైసంవత్సరాలు పడుతుంది. మీరు ధనవర్మకు యాభైసంవత్సరాలు వెనకపడి ఉంటారు,'' అని హెచ్చరించి జ్ఞాని వెళ్ళిపోయాడు.

కొంతకాలానికి జ్ఞానశేఖరుడు సమాధి నుంచి పైకి వచ్చి, ఉభయదేశాలలోని పరిస్థితులు ఎలా ఉన్నదీ చూడటానికి బయలుదేరాడు. ధీరవర్మ తాను కరువు నివారణకు చేసిన చర్యలు వివరించి చెప్పి, దంతపుపెట్టెను ఒక్కసారి కూడా ఉపయోగించలేదన్నాడు.

ధనవర్మ మటుకు జ్ఞానశేఖరుడిచ్చిన దంతపుపెట్టె సహాయంతో తాను తన దేశాన్ని, కరువు నుంచి కాపాడి, ప్రజలను ఎంత ముందుకు తెచ్చినదీ ప్రత్యక్షంగా చూపించాడు.

ధీరవర్మ కిచ్చిన పెట్టెను ధీరవర్మ వద్దనే ఉండనిచ్చిన జ్ఞానశేఖరుడు ధనవర్మ చెప్పినదంతా విని, అతను సాధించిన ప్రగతి కళ్ళారా చూసి, అతనికి తాను ఇచ్చిన దంతపుపెట్టెను తిరిగి తీసుకున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, జ్ఞానశేఖరుడు ఇలా చెయ్యటానికి కారణం ఏమిటి? ధీరవర్మ పట్ల పక్షపాతమా? లేక ధనవర్మ తన దంతపుపెట్టె నుంచి ఇక పొందవలసిన ప్రయోజనం ఏమీ లేదనా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల బద్దలవుతుంది." అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "జ్ఞానశేఖరుడు ధనవర్మ వద్దనుంచి పెట్టె తిరిగి తీసుకోవటానికి అసలు కారణం, ఆయన తెలిపిన రెండు నియమాలూ ధనవర్మ ఉల్లంఘించాడు. అతను రెండుసార్లూ తనకు ఏ సమస్యా ఏర్పడకముందే పెట్టెను తెరిచాడు. స్వశక్తితో, కరువు వచ్చేలోపల దాన్ని ఎదుర్కొనే ప్రయత్నాలు ఆలోచించకుండానే దంతపుపెట్టెను తెరిచి, ధనం సంపాదించి, దానితో అవసరాన్ని మించి ధాన్యం కొని దుర్వినియోగం చేశాడు. ప్రజలకు పొదుపు నేర్చుకునే అవకాశం కూడా లభించలేదు. రెండోసారి తన దేశంలోని భూగర్భసంపదను సగం జ్ఞానికి ధారపోసి, రాబోయే తరాలవారి నోట మట్టి కొట్టాడు. ప్రజలకు మేలు చేస్తున్నాననుకుంటూ ధనవర్మ కనిపించని కీడు చేశాడు. ధీరవర్మ తాను పరిష్కరించగలిగినదానికి దంతపుపెట్టె మీద ఆధారపడలేదు. అందుచేత అతను దంతపుపెట్టెను దుర్వినియోగం చేస్తాడన్న భయం లేదు. అందుకే జ్ఞానశేఖరుడు ధీరవర్మ వద్ద పెట్టెను ఉండనిచ్చి, ధనవర్మ వద్ద నుంచి పెట్టెను తీసేసుకున్నాడు." అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# బుద్ధిమంతుడు

ఒక గ్రామంలో ఒక ధనికుడి కుమార్తెకు వివాహం జరగబోతున్నది. ఆయన పట్నంలో నగల వర్తకులకు ఏనాడో డబ్బు ఇచ్చి, అయిదువేల రూపాయల నగలు చేయించటానికి ఏర్పాటు చేశాడు. ఆ నగలు తెచ్చుకోవాలి. అయితే కొద్దిరోజులుగా, పట్టణానికీ, గ్రామానికీ మధ్య ఉన్న చిన్న అడవిలో దొంగల బెడద ఎక్కువయింది.

నగలను ఎలా తెప్పించటమా అని ధనికుడు దిగులుపడుతుంటే, ఆయన వద్ద పని చేసే చంద్రశేఖరుడు అనేవాడు, తాను వెళ్ళి తెస్తానన్నాడు. చంద్రశేఖరుడు నమ్మకస్తుడు కనక యజమాని సరేనన్నాడు.

చంద్రశేఖరుడు అడవికుండా వెళ్ళేటప్పుడు నలుగురు మనుషులు అతన్ని అటకాయించి సోదాచేశారు. తన వద్ద ఏమీ లేదనీ, తాను పట్నం నుంచి తిరిగివచ్చేటప్పుడు పదివేల రూపాయల నగకట్టు ఉంటుందనీ చంద్రశేఖరుడు వారితో చెప్పాడు. వాళ్ళు వాణ్ణి వెళ్ళిపోనిచ్చారు.

మర్నాడు వాడు తిరిగివచ్చేటప్పుడు ఆ నలుగురే వాణ్ణి అటకాయించి, "నగకట్టు ఎక్కడ?" అని అడిగారు.

"నగలవర్తకుడు ఇయ్యలేదు. దొంగల భయం ఉన్నదనీ, నలుగురు మనుషులను తోడు తెస్తేగాని ఇయ్యననీ అన్నాడు. మీరే నాకు తోడుగా రండి," అన్నాడు చంద్రశేఖరుడు.

వాళ్ళు సంతోషించి చంద్రశేఖరుడి వెంట వెళ్ళి, రక్షకభటులకు పట్టుబడ్డారు. తరవాత ఆ దారిన దొంగల భయం తొలగింది.

—పి. ఆర్. రాజన్







# సేనాని అదృష్టం

"జయము, జయము, మహారాజా! మన సేనాని విక్రమజితుడు యుద్ధంలో విజయుడై, పాన్నారాజును ఓడించి, బందీగా పట్టుకుని నగరానికి వస్తున్నాడు," అని వార్తాహరులు జయంత మహారాజుకు విన్నవించారు.

జయంతుడు పరమానందంతో, "వేడుకలు జరపండి. విజయతోరణాలు నిర్మించండి," అన్నాడు.

"కాని, ఒక్క విషయం, మహారాజా? అది ఎలా విన్నవించటం?" అన్నారు వార్తాహరులు.

"భయంలేదు, చెప్పండి," అన్నాడు జయంత మహారాజు.

"యుద్ధంలో సేనాని ఎడమచేతి నడిమివేలు పోయింది," అన్నారు వాళ్ళు.

జయంత మహారాజు అరిచేత్తో నుదురు కొట్టుకుని, సింహాసనం మీద చతికిలబడిపోయాడు. ఇది దుర్వార్త. మహావీరుడూ, విజయుడూ అయిన విక్రమజితుడు ఇంక సేనానిపదవిలో ఉండటానికి పనికిరాడు! ఎంత చిన్న అంగవైకల్యం ఉన్నాసరే సేనానిగా పనికిరాడన్నది ఆ దేశపు నియమం. ఆ దిక్కుమాలిన నియమం తనను వేధించటానికే వచ్చిందనుకున్నాడు జయంతుడు. ఎందుచేతనంటే, విక్రమజితుడు దేశానికి పెట్టనికోట. అతని మూలంగానే జయంతుడు నిశ్చింతగా పరిపాలన కొనసాగించాడు. అతను ఆ పదవిలో ఉండటానికి వీలులేదంటే అది జయంతుడికి పెద్ద దెబ్బ అన్నమాట. ఆయనకు విజయం లభించిందన్న ఆనందం కూడా లేకుండా పోయింది.

విక్రముడూ, జయంతుడూ, ప్రధాని కొడుకూ చిన్నతనం నుంచీ స్నేహితులు. తన తండ్రి పోయినాక జయంతుడు



రాజయినట్టే, విక్రముడు కూడా తన తండ్రి స్థానంలో సేనాని అయాడు.

జయంతుడు మనోవ్యాధి పడిపోయాడు. ఆయన రాచకార్యాలన్నీ ప్రధానికే వదిలి, తాను అంతఃపురంలో పాతుకుపోయి కుమిలిపోసాగాడు. విక్రముడు లేకపోతే శత్రువులు దండెత్తివస్తే దేశం ఏం కావాలి? రాజుకు తీరని బెంగ పట్టుకున్నది; అన్న హితవు తప్పింది; చివరకు ఆయన మంచం పట్టాడు.

విక్రమజితుడు ఆయనను కలుసుకుని, "ఎందుకు బేజారై పోతారు? నా జీవితాంతం దాకా నేను మీ వెంటే ఉంటాను," అన్నాడు.

"ఏం లాభం? సేనానిగా ఉండలేవుగా? అనవాయితీలు! నియమాలు! ఆచారాలు! నన్ను ఇవి చేతులూ, కాళ్ళూ కట్టేసినాక నేను రాజుగా ఉండి ఏమిటి, మాని ఏమిటి?" అన్నాడు జయంతుడు.

ఆయనకు ఆవేశం వచ్చి, మతి చలించింది. వైద్యులు వచ్చి మనస్థిమితం కలిగించారు.

"విక్రమజితుణ్ణి సేనానిగా ఉంచగలిగితేనే గాని రాజు వ్యాధి నయం కాదు," అన్నాడు ప్రధాని ఇతర మంత్రులతో.

"అది ఎలా సాధ్యం? ఈ నియమం అనాదిగా వస్తున్నది. విక్రముడి ముత్తాత మడమ విరుచుకుని పదవి నుంచి తొలగాడు. విక్రముడి తాత కన్ను పోగొట్టుకుని సేనాని పదవి విసర్జించాడు. విక్రముడి ముత్తాత తండ్రి మాత్రం, చెవి తెగిపోయి కూడా, దైవనిర్ణయం అనుకూలించటం వల్ల సేనాని పదవిని కాపాడుకోగలిగాడు," అన్నాడు శాసనమంత్రి.

"అదెలా?" అని అందరూ ఒక్కసారిగా అడిగారు.

శాసనమంత్రికి వివరాలు తెలియవు. కాని విక్రముడి ముత్తాత తండ్రి సేనాని పదవి పోగొట్టుకుని కూడా, దైవనిర్ణయాన్ని అనుసరించి తిరిగి పదవి పొందాడని తెలిసింది.

"దైవనిర్ణయం ఇప్పుడు మాత్రం ఎందుకు అనుకూలించ గూడదూ?" అని రాజపురోహితుడు అడిగాడు.

"అలా అయితే దేవుణ్ణి ప్రార్థించి, దైవ నిర్ణయంద్వారా రాజుగారికి స్వస్థత కలిగే టట్టు చూడటం మీ వంతు," అన్నాడు ప్రధాని.

ఆస్థాన ఐంద్రజాలికుడు భాస్కరుడు ఒక మూలగా కూర్చుని ఉండి, రాజ పురోహితుడు తన కేసి చూడగానే కన్ను ఘలిపాడు. అతని కేదో ఆలోచన ఉన్నట్టు స్పష్టమయింది.

"సరే, నేను దేవుణ్ణి ప్రార్థించి, ఆయన అనుగ్రహం సంపాదించటానికి ప్రయత్ని స్తాను. ఏం జరుగుతుందో చూతాం," అంటూ రాజపురోహితుడు అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

భాస్కరుడు ఆయనను ఆలయంలో కలుసుకుని తాను ఆలోచించిన పథకం తెలిపాడు.

మర్నాడు రాజపురోహితుడు సభకు వెళ్ళి, ఇలా చెప్పాడు:

"నేను ధ్యానసమాధిలో ఉండగా నాకు ఒక దృశ్యం కనిపించింది. తెగిపోయిన విక్రముడి వేలును ఒక కాకి తెచ్చి ఈ ఉదయం దేవాలయంలో పడవేసింది. నాకు కనిపించినదృశ్యంలో ఆ తెగిపోయిన



వేలు కొద్దిక్షణాలపాటు కదిలేలాగా కన బడింది. ఆ కదలిక వల్ల మనకు దేవుడు అనుకూలంగా ఉన్నట్టు రుజువు అవు తుంది. అప్పుడు విక్రమజితుడు, పాత సంప్రదాయాన్ని బట్టి, తిరిగి సేనాని పదవి చేపట్టవచ్చు."

"మనక్కావలసింది అదే! ఈ అద్భుతం ఎప్పుడు జరుగుతుంది?" అని ప్రధాని అడిగాడు.

"మహారాజు దేవాలయానికి వచ్చే మాటైతే, ఈ సాయంకాలమే అద్భుతం కనిపిస్తుంది," అన్నాడు రాజపురోహితుడు.

ఆ సాయంకాలం రాజూ, ప్రధానీ, పుర ప్రముఖులూ, రాజుగారి దేవాలయంలో

చేరారు. అందరూ కూర్చున్నాక రాజ పురోహితుడు గర్భగుడిలోకి వెళ్ళి, నిప్పు పెట్టె సారుగు ఆకారమూ, ప్రమాణమూ గల ఒక లోహపు పెట్టెతో తిరిగివచ్చాడు. ఆ పెట్టె అడుగున దూది పరిచి ఉన్నది. దానిమీద తెగిపోయిన వేలు ఉన్నది. అది నీలంగా ఉన్నది. దాని చివరలు తెల్లబడి ఉన్నాయి. ఆ పెట్టె రాజ పురోహితుడి ఎడమ చేతిలో ఉన్నది. ఆ వేలును అందరికీ చూపి, రాజ పురోహితుడు ధ్యానసమాధిలోకిపోయాడు. కొద్దిసేపటికి ఆయన కళ్ళు తెరిచి, "ఈశ్వరా, అనుగ్రహించు. నీ నిర్ణయం తెలియజేసి, మాకు ఆనందం చేకూర్చు," అన్నాడు.

పెట్టెలోని వేలు కొద్దిసార్లు పైకీ, కిందికీ ఆడింది. రాజపురోహితుడు వెంటనే ఆలయపు కోనేటికి పరిగెత్తి, ఆ వేలును అందులో ముంచేశాడు. ఆయన తన వెంట రాజపరివారంలోని వాళ్ళను ఎవరినీ రానియ్యలేదు.

భాస్కరుడు ఆలయం వెనకనే వేచి ఉండి, పురోహితుడి చేతి నుంచి పెట్టెను ఊడలాగాడు. రాజపురోహితుడి ఎడమచేతి నడిమివేలు, ఆ పెట్టె అడుగున ఉన్న రంధ్రంకుండా బయటికి వచ్చింది. దానికి నీలం రంగు వేసి, చివరలు తెల్లగా చేశారు. అందరూ కదలగా చూసినది పురోహితుడి వేలే!

ఈ ప్రదర్శనతో దైవనిర్ణయం విక్రమ జితుడికి అనుకూలంగా ఉన్నట్టు అందరికీ గురి కుదిరింది. ఆయన యథాప్రకారం సేనాని పదవిలో ఉండిపోయాడు. జయంత మహారాజుకు పరమానందమయింది. విజయపు వేడుకలు ఎంతో ఉత్సాహంగా జరిపారు.

పాన్నారాజు జయంతుడికి సామంతుడుగా ఉండేటట్టు సంధి చేసుకుని, ఆయనను బంధవిముక్తుణ్ణి చేశారు. జయంత మహారాజు విక్రమజితుణ్ణి సేనానిగా పెట్టుకుని ఎంతో కాలం సుఖంగా రాజ్యపాలనచేశాడు.





# అంచెలంచెల సన్యాసం

వీరవరం గ్రామంలో ముత్యాలయ్యకు ఇద్దరు కొడుకులు. పెద్దవాడు హరి సుమారు ఇరవై ఏళ్ళవాడు. రెండోవాడు గిరి రెండేళ్ళు చిన్నవాడు. హరికి సరిగా చదువు రాలేదు. వ్యవహార జ్ఞానం లేదు. ఏ పనీ చేతకాదు.

గిరి విద్యాభ్యాసం పూర్తిచేసి ఇంటికి తిరిగి వచ్చాడు. తన తమ్ముడు తనకన్న తెలివైనవాడనీ, అనేక విద్యలలో ఆరి తేరినవాడనీ అందరూ మెచ్చుకోవటమే గాక, తనని చులకనచేసి మాట్లాడటం వినగానే హరికి విరక్తి కలిగింది. ఆ సమయంలో శ్రద్ధానందుడు వారి ఇంటికి భిక్షకు వచ్చాడు.

శ్రద్ధానందుడు సన్యాసి. ఆయన ఊరి చివర ఉన్న కొండమీద ఒక గుహలో ఉంటున్నాడు. ఊళ్ళో అందరూ ఆయనను గౌరవించేవారు. ప్రతి ఉదయమూ ఆయన భిక్ష కోసం ఊళ్లోకి వచ్చి, ప్రతి ఇంటిముందూ కొద్దిక్షణాలు మాత్రమే నిలబడి, ఎవరేది ఇచ్చినా పుచ్చుకునేవాడు.

ఇంట్లో ఏ పనీ లేనివాడు హరి ఒక్కడే గనక, శ్రద్ధానందుడికి రోజూ అతనే భిక్ష పెట్టేవాడు. ఈ సారి అతను శ్రద్ధానందుడిలో ఆనందం గమనించి, "తమరు చాలా సంతోషంగా కనబడుతున్నారు. కారణం చెప్పగలరా?" అని అడిగాడు.

శ్రద్ధానందుడు నవ్వి, "నేను సమస్తమూ సన్యసించినవాణ్ణి. సన్యాసికి విచారం ఏముంటుంది?" అన్నాడు.

హరికి బుర్రలో తళుక్కున ఒక ఆలోచన మెరిసింది. సన్యాసి కావటం పెద్ద కష్టం కాదు. అందుకు తెలివి తేటలు అవసరం లేదు. తాను సన్యాసి అయితే ఊళ్ళో గౌరవమూ వస్తుంది.

"వసుంధర"



ఈ అభిప్రాయంతో హరి, ''స్వామీ, నాక్కూడా సన్యాసిని కావాలని ఉంది. ఏం చెయ్యాలో సెలవిస్తారా?'' అని శ్రద్ధానందుణ్ణి అడిగాడు.

''గట్టిగా ఇరవై ఏళ్లు లేవు, నీ కెందుకు, నాయనా, సన్యాసం? అంతగా కావాలంటే ఈ సాయంత్రమే నా గుహకు రా. నేనే నీకు దీక్ష ఇస్తాను,'' అన్నాడు శ్రద్ధానందుడు.

ఆ సాయంకాలం హరి కొండమీద శ్రద్ధానందుడి గుహకు వెళ్ళాడు.

శ్రద్ధానందుడు అతన్ని చూసి, ''వచ్చావా? సన్యాసమంటే ఏమిటో తెలుసా? విసర్జించటం. తల్లిదండ్రుల్నీ, సిరిసంపదల్నీ, నాది అనే భావాన్నీ వదిలి పెట్టాలి. ప్రపంచంతో ఏ బంధమూ ఉండకూడదు,'' అన్నాడు.

హరి ఆయన పాదాలమీద పడి, "స్వామీ, నేను సామాన్యుణ్ణి. ఒక్కసారిగా అన్నింటినీ విడిచిపెట్టలేను. కాని నాకు జీవితం మీద విరక్తి కలిగింది. అందరిలాగా అందరితోటీ బ్రతకాలని లేదు. కాబట్టి మీకు శుశ్రూష చేస్తూ, ఒక్కటొక్కటే విడిచిపెడతాను,'' అన్నాడు.

శ్రద్ధానందుడు క్షణం ఆలోచించి, ''అందుకు ఒక పద్ధతి ఉన్నది. అంచెలంచెలుగా సన్యసించే మార్గం నాకు తెలుసు, ఇప్పుడు దేన్ని సన్యసిస్తావో చెప్పు,'' అన్నాడు.

''నాకు ఇంటి మీద ఏ మాత్రమూ మోజు లేదు. ఇంటిని సన్యసిస్తాను, స్వామీ,'' అన్నాడు హరి.

''అయితే ఈ రోజు నుంచీ నువు గృహసన్యాసివి. ఇక్కడే నాతోబాటు ఉండు,'' అన్నాడు శ్రద్ధానందుడు. ఆయన చెప్పే వేదాంత విషయాలు విని, హరి ఆ రాత్రికి అక్కడే నిద్రపోయాడు.

హరి కనబడక ముత్యాలయ్య ఇంట్లో అందరూ కంగారుపడ్డారు. మర్నాడు శ్రద్ధానందుడు వారి ఇంటికి భిక్షకు వెళ్ళి, అందరూ విచారంగా ఉండటం చూసి

కారణం తెలుసుకుని, హరి క్షేమంగా తన గుహలో ఉన్నట్టు చెప్పాడు.

జరిగిన సంగతి తెలుసుకుని ముత్యాలయ్య, "వాడికి ఏం లోటు వచ్చిందని సన్యాసి అవుతున్నాడు?" అన్నాడు.

"ఎందువల్లనో మీ అబ్బాయికి జీవితం మీద విరక్తి కలిగింది. ఆ విరక్తి నిలిచేదో కాదో నాకు తెలీదు. ఇప్పుడు మీరు వచ్చి ఇంటికి రమ్మంటే రాడు, కాని మీరు తరచు కనబడుతూంటే అతని మనస్సు మెత్తబడవచ్చు." అని చెప్పి శ్రద్ధానందుడు వెళ్ళిపోయాడు.

వెంటనే ముత్యాలయ్య సకుటుంబంగా హరిని చూడబోయాడు. హరి ప్రశాంతంగా వాళ్ళను పలకరించాడు. తల్లీ, తండ్రీ, తమ్ముడూ బతిమాలినా, హరి ఇంటికి తిరిగి రావటానికి ఒప్పుకోలేదు.

హరి కటికనేల మీద పడుకోవడం సహించలేక ముత్యాలయ్య మెత్తని పరుపు కొండగుహకు పంపించాడు. శ్రద్ధానందుడు తినే తిండి హరి తినలేడని, అతని తల్లి నౌకరు ద్వారా మంచి మంచి వంటకాలు కొడుక్కు పంపించసాగింది.

హరి పరుపు గలీబులు మార్చటానికి తరచుగా ఒక చాకలి వచ్చి వెళుతూండేవాడు. ఒకసారి వాడు, "ఏం సన్యాసమో ఈ హరిబాబుది? రోజూ ఈ ఊరి చివరి కొండెక్కి రాలేక మధ్యనాకు చావొచ్చింది!" అని గొణుక్కోవటం హరి విన్నాడు. అతనికి పరుపు మీద విరక్తి పుట్టింది. అతను





ఆ పరుపును చాకలి చేతి కిచ్చి తిప్పి పంపేసి, శ్రద్ధానందుడితో, "స్వామీ, నేను కూడా మీలాగే కటికనేల మీద పడుకోదలిచాను," అన్నాడు.

"అయితే నువు తల్పసన్యాసం చేశావన్నమాట," అన్నాడు శ్రద్ధానందుడు.

మరికొంతకాలం గడిచాక, తనకు భోజనం తెచ్చేవాడు కూడా, ఏడుస్తూ విధిలేక ఆ పని చేస్తున్నట్టు హరి గ్రహించాడు. అతను శ్రద్ధానందుడి వద్దకు వెళ్ళి, తాను రుచులను గురించి ఇంక పట్టింపు పెట్టుకోననీ, శ్రద్ధానందుడు ఏది తింటే తానూ అదే తింటాననీ చెప్పి, భోజనం పంపనవసరంలేదని తండ్రికి కబురుపంపాడు.

శ్రద్ధానందుడు హరిని అభినందిస్తూ, "నాయనా, నీ మనసు క్రమంగా పరిపక్వం చెందుతున్నది. నువ్విప్పుడు జిహ్వా సన్యాసివి కూడా అయావు," అన్నాడు. హరి చాలా సంతోషించాడు.

కొడుకు విరక్తి నానాటికీ తగ్గకపోగా హెచ్చటం చూసి, ముత్యాలయ్య తన భార్యతో సహా వచ్చి, హరిని ఇంటికి తీసుకుపోవటానికి విశ్వప్రయత్నం చేశాడు. కాని హరి మనసు మారలేదు.

"ఇదే ఆఖరు అవకాశం. ఇవాళ మాతో రాకపోతే నీకూ, మాకూ ఎలాటి సంబంధమూ ఉండదు. నా ఆస్తిలో నీకు చిల్లిగవ్వ కూడా రాదు. శాశ్వతంగా సన్యాసిలా ఇక్కడే పడి ఉండు," అన్నాడు ముత్యాలయ్య హరితో.

హరి తల్లి కూడా అలాటి కొడుకును కన్నందుకు తననుతాను తిట్టుకున్నది.

"విచారించకమ్మా! ఈనాటి నుంచీ నాకు కూడా తల్లీ, తండ్రీ లేరు. బంధుత్వాల మీద కూడా నాకు విరక్తి పుట్టింది. మీరు వెళ్ళవచ్చు. నా కోసం మీరెన్నడూ రానక్కర్లేదు," అన్నాడు హరి.

ముత్యాలయ్యా, భార్యా దిగులుగా వెళ్ళిపోయారు.

హరి శ్రద్ధానందుడి వద్దకు వెళ్ళి జరిగినది చెప్పాడు.

"ఈ క్షణం నుంచీ నువు బంధు సన్యాసివి కూడా అయావు. త్వరలోనే నువు పూర్తిసన్యాసివి కాగలవు," అన్నాడు శ్రద్ధానందుడు.

కొంతకాలం గడిచాక హరిని చూడటానికి అప్సరసలాటి పదహారేళ్ళ పడుచు పిల్ల వచ్చింది. ఆమెను చూడగానే హరి కళ్ళు జిగేల్మన్నాయి.

"ఎవరు నువు?" అని అతను ఆమెను అడిగాడు.

"నన్ను గుర్తుపట్టలేదా, బావా?" అన్నదామె.

హరి ఆమెను పరీక్షగా చూసి, "నువా, నళినీ!" అన్నాడు. ఆమె అతని మేనమామ కూతురు. అతను ఆమెను అయిదారేళ్ళ క్రితం చూశాడు. ఈ మధ్యకాలంలో అతని మేనమామ సకుటుంబంగా రాచనగరుకు వెళ్ళిపోయాడు.

"నిన్ననే ఈ ఊరు వచ్చాం, బావా. వచ్చినప్పటినుంచీ నా కళ్ళు నీ కోసమే వెతుకుతున్నాయి. ఇలాటిచోట ఉన్నావేమిటి?" అని నళిని అడిగింది.

"నే నిప్పుడు సన్యాసిని. నాకు ఇల్లూ, వాకిలీ, తల్లీ, తండ్రీ లేరు," అన్నాడు హరి.

"తోడూ, నీడా సంగతి ఏమిటి?" అన్నది నళిని.

"నాకు అవసరం లేదు. ఇలాగే బాగుంది," అన్నాడు హరి.

"అలాగంటే, నిన్ను ప్రేమించిన నా గతేంకాను?" అని నళిని అడిగింది.



'' నన్ను ప్రేమించావా ? ఏం చూసి ? నాలో నాకే ఏ విశేషమూ కనిపించక సన్యాసి నయాను,'' అన్నాడు హరి.

'' అదేమిటి, బావా? నిన్ను చూస్తే మళ్లీ మళ్లీ చూడాలనిపిస్తుంది. నీ మాటలు వింటూంటే మరీ మరీ వినాలని ఉంటుంది. నువు లేకపోతే బ్రతకలేను," అన్నది నళిని.

హరికి చాలాసంతోషం కలిగింది. కాని అతను దాన్ని పైకి కనిపించనియ్యక, '' నేను ఇప్పుడు సర్వసంగపరిత్యాగిని. నా మీద ఆశలు పెంచుకోకు. చూడా లనిపిస్తే రేపు మళ్ళీరా.'' అన్నాడు.

ఆ రాత్రి హరికి నిద్రపట్టలేదు. అతను నళిని గురించే ఆలోచించాడు. మర్నాడు ఆమె మళ్ళీ వస్తే బాగుండుననుకున్నాడు. అలాగే నళిని మర్నాడు వచ్చింది. ఆమెను చూడగానే హరిముఖం చేటంత అయింది.

'' లాభంలేదు, బావా. నువు లేని ఆ ఇల్లు నాకు నరకంలాగుంది. నేనూ ఇక్కడే ఉండిపోతాను. నాకు కూడా సన్యాసం ఇప్పించు,'' అన్నది నళిని.

హరి నెమ్మదిగా శ్రద్ధానందుడి వద్దకు వెళ్ళి, '' స్వామీ ! '' అన్నాడు.

'' ఏం, నాయనా ? ఈసారి దేన్ని సన్యసించ దలిచావు ? '' అన్నాడు శ్రద్ధానందుడు.

"సన్యాసాన్ని, స్వామీ?" అన్నాడు హరి.

శ్రద్ధానందుడు ఈ మాట విని ఉలిక్కి పడ్డాడు. తరవాత ఆయన విషయమంతా విని, '' సరే, నాయనా, వెళ్ళు. నీ మీద ప్రత్యేకమైన ఆసక్తి చూపేవారు లేక నీకు జీవితం మీద విరక్తి కలిగింది. నిన్ను ప్రేమించిన ఒక్క మనిషి మాటలు నిన్ను మళ్ళీ మామూలు మనిషిని చేశాయి. నువు సుఖపడి, నిన్ను ప్రేమించిన వారిని సుఖ పెట్టు,'' అన్నాడు.

హరి శ్రద్ధానందుడి పాదాలకు మ్రొక్కి, నళినితో కలిసి ఇల్లు చేరుకున్నాడు. అతనిలో మార్పు చూసి అందరూ అతని పైన ఎన్నడూ చూపని ఆసక్తి చూపారు. అది హరికి చాలా తృప్తి కలిగించింది. అతను నళినిని పెళ్లాడి సుఖంగా ఉన్నాడు






# పట్నంలో వ్యాపారం

ఒక ఊళ్ళో చిన్నయ్యశెట్టి అనే చిల్లర వర్తకుడు ఉండేవాడు. అతను చిన్నతనం నుంచీ ఊరివారికి అనుకూలంగా ఉంటూ, వాళ్ళమీదనే ఆధారపడి తన వ్యాపారం చేసుకుంటూ, మంచివాడని పేరు తెచ్చుకున్నాడు.

శెట్టి కొడుకులిద్దరూ ఎదిగివచ్చారు. వాళ్ళు కూడా తనలాగే, ఊరి జీవితంలో తమ జీవితం ఒకభాగం అన్నట్టుగా బతకాలని శెట్టి ఆశించాడు. శెట్టి పెద్దకొడుకు శెట్టిలాటివాడే, కాని రెండోవాడు కాశీపతి లక్షలకులక్షలు గడించాలనీ, చాలా భారీ ఎత్తున వ్యాపారం చేసి కుబేరుడైపోవాలనీ కలలుకనసాగాడు.

కాశీపతికి ఇలాటి ఆలోచనలు ఉన్నట్టు తెలిసి శెట్టి, "నాయనా, ఇతరుల మేలే మన మేలు అనుకున్నవాళ్ళు అలాటి వ్యాపారాలు చేయలేరు. భారీ ఎత్తున ప్రజలకు ద్రోహంచెయ్యటానికి వెనకాడని వాళ్లే అలాటివ్యాపారం చేయగలుగుతారు. మనం నలుగురితోబాటు బతికితే చాలు," అని సలహా ఇచ్చాడు.

కాని కాశీపతికి తండ్రి మాటలు పాతకాలపు వాసనకొట్టాయి. "ఇది ఒక వ్యాపారమా? ఇది ఒక బతుకా? నేను ఈ ఊళ్ళో చచ్చినా ఉండను," అని అతను అప్పటికప్పుడే బస్తీకి బయలుదేరి వెళ్ళాడు.

అతను చిన్నప్పుడు ఎప్పుడో తండ్రి వెంట వెళ్ళి చూసిన పట్నం చాలా మారిపోయింది. ఎత్తుగా లేచిన రంగురంగుల మేడలూ, వీధులనిండా జనమూ, ముఖ్యంగా కళ్లుచెదిరే క్రయవిక్రయాలూ, బళ్ళ మీద రవాణా అవుతున్న సరుకుల గుట్టలూ, దుకాణాలలో గలగలా రాలుతున్న డబ్బూ—ఇదంతా కళ్లారాచూసినాక

బూర్లె నాగేశ్వరరావు



కాశీపతి నిర్ణయం మరింత బలపడింది. పట్నంలో వ్యాపారం చేస్తున్నవాళ్ళూ మనుషులే; కాకపోతే తన తండ్రిలాటి పిరికివాళ్ళు కారు.

కాశీపతి ఇంటికి తిరిగివచ్చి, తాను పట్నంలోనే వ్యాపారం చేస్తాననీ, అందుకు గాను తనకు పెట్టుబడి కావాలనీ, తన వాటా తనకు వెంటనే పంచి ఇయ్యమనీ కూర్చున్నాడు.

చిన్నయ్యశెట్టికి ఏమీపాలుబోక, కరణాన్ని సలహా అడిగాడు. కరణం కొంచెం ఆలోచించి, "వాడికి ఈ పట్నం వ్యాపారం భ్రమ వదలాలంటే కొంత ఖర్చుజరగక తప్పదు. పట్నం పోవద్దన్న కొద్దీ దాని మీద భ్రమ హెచ్చుతుందేగాని తగ్గదు," అన్నాడు.

"అయితే ఆస్తి పంపకాలు చెయ్యవలసిందేనా?" అని అడిగాడు శెట్టి, దిగాలుపడిపోతూ.

"అంతదాకా రాకుండా చూద్దాంలే," అని కరణం శెట్టికి ఏం చెయ్యాలో చెప్పి పంపేశాడు.

శెట్టి ఇంటికివచ్చి తన కొడుకులతో ఇలా అన్నాడు:

"చూడండి! మన ఆస్తి పంపకాలు చెయ్యటానికి నిశ్చయించాను. పట్నంలో భారీ వ్యాపారం చెయ్యటం నాకు ఇష్టం లేదనుకోకండి. కాని మన సంసారంలో మీకు తెలియని విషయం ఒకటున్నది. అదేమిటంటే, మనం చాలా ఋణపడి ఉన్నాం. ఈ విషయం మీకు ఏనాడో చెప్పి ఉండవలిసింది, కాని మీ మనస్సులు కష్టపెట్టటం ఇష్టం లేక చెప్పలేదు. కాని ఇక దీన్ని దాచటం సాధ్యం కాదు. మనం భాగాలు పడుతున్నామని తెలియగానే బాకీదార్లు వచ్చి గుమ్మంలో కూర్చుంటారు. అందుచేత ఋణాలు తీరగా మిగిలినది సమంగా పంచుకుందాం. తరవాత ఎవరిదారి వారిది."

తరవాత శెట్టి, కొడుకులిద్దరినీ వెంట బెట్టుకుని కరణంగారింటికి వెళ్ళాడు.

కరణంగారు ముగ్గురినీ కూర్చోబెట్టి పాత దస్త్రం ఒకటి తెచ్చి వారిముందు ఉంచాడు.

అదిచూసి కాశీపతి గుండె ఆగినంత పని అయింది.

''ఎందుకు చేశారు ఈ అప్పు? ఎవరు చెయ్యమన్నారు? ఇంతకాలంగా ఎందుకు తీర్చలేదు?'' అని అతను చిందులు తొక్కాడు.

కరణంగారు నింపాదిగా, ''చూడు, బాబూ! మీ నాన్న మర్యాదస్తుడు కాబట్టి ఇంతదాకా ఓపిక చేశాను. కావాలంటే ఈ క్షణం మీకున్నదంతా స్వాధీనం చేసుకుని, మిమ్మల్ని బజారుపాలు చేయ గలను.'' అన్నాడు.

కాశీపతి పిచ్చివాడిలా అయిపోయి, జుట్టు పీక్కుంటూ, ''చూడండి, కరణం గారూ! పట్నం వెళ్ళి భారీగా వ్యాపారం చేసి, అంతులేని ధనం సంపాదించా లనుకున్నాను. కాని, మా నాన్నలాటి దరిద్రుడి కడుపున పుట్టినందుకు భోరున ఏడవాలనిపిస్తున్నది. మీరే ఏదైనా మార్గం చూడండి. ఇలా కుమ్మరిపురుగులా జీవిం చడంకన్నా చావడం నయం.'' అన్నాడు.

''కంగారుపడకు. నువు అంతటి సమర్థుడివే అయితే మీ నాన్న దరిద్రం తీరిపోతుంది. మా బాకీ తీరిపోతుంది. అందుకు నేను నీకు కొంత ధనసహాయం చెయ్యగలను.'' అని కరణంగారు రెండు వేలు తెచ్చి కాశీపతికిచ్చి, ''వ్యాపారంలో





ఈ డబ్బు పోయినా విచారించకు. నా దగ్గిరికి రా, నీకు మళ్ళీ డబ్బిస్తాను. నీ మీద నా కెందుకో అమితంగా విశ్వాసం కలుగుతున్నది,'' అన్నాడు.

కాశీపతి తన చెవులను తానే నమ్మలేక పోయాడు. "మీ డబ్బు తీర్చడం లెక్కలోది కాదు. ఒక్క సంవత్సరంలో, చూడండి, వీటిని ఎన్నివేలు చేస్తానో!'' అన్నాడు.

కాశీపతి వెళ్ళిపోగానే కరణంగారు చిన్నయ్యశెట్టితో, ''దీనితో మీ వాడికి బుద్ధి అయినావస్తుంది, లాభమయినా వస్తుంది,'' అన్నాడు.

శెట్టి నవ్వి, ''ఏది వచ్చినా మంచిదే," అన్నాడు.

కాశీపతి డబ్బుతో పట్నం వెళ్ళి, వ్యాపారం బాగా సాగేచోటు చూసి, ఓ ఇల్లు అద్దెకు తీసుకున్నాడు. అతను ముందుగా సాటివ్యాపారస్తులతో సంప్రతించి, వారి సలహాప్రకారం తన వద్ద ఉన్న రెండువేలతో కోస్తా నుంచి చింత పండూ, పసుపుకొమ్ములూ ఖరీదుచేసి తెచ్చాడు. ప్రారంభిస్తూనే కాశీపతి వ్యాపారం నాలుగు కాళ్ళమీద దౌడు తీసింది. అందుకు కారణం, కాశీపతి తన సరుకును ఇతరులకన్న తక్కువ ధరకు అమ్మాడు. సరుకు తేవడంలో వాళ్ళ సలహా పాటించిన కాశీపతి దాని అమ్మకం విషయంలో వాళ్ళను లక్ష్యపెట్టలేదు. అయితే ఈ వ్యాపారంలో కాశీపతికి పెద్దగా మిగలలేదు! లాభం చేశాననిపించుకున్నాడు.

అయితే సాటి వ్యాపారస్థులు కాశీపతిని ఆకాశానికెత్తి, వ్యాపారంలో అతనిదే ప్రజ్ఞ అన్నారు; ముందు ముందు చాలా పైకి వస్తావన్నారు.

''మరొకసారి మీ సహకారం నాకు కావాలి. ఈసారి ఏ సరుకు తెస్తే బాగుంటుందో మీరే చెప్పండి,'' అన్నాడు కాశీపతి.

''పసుపూ, చింతపండూ నీ వద్ద కొని నిలవచేసుకున్నారు చిన్న వర్తకులు. ఇక

వాటికి గిరాకీ ఉండదు. ప్రస్తుతం కొరతగా ఉన్న వస్తువు ఉల్లిపాయ మాత్రమే కనిపిస్తున్నది." అన్నారు సాటి వర్తకులు.

కాశీపతి వాళ్ళకు కృతజ్ఞత చెప్పుకుని, మరసటి రోజునే కోస్తాకువెళ్ళి, ఉన్న డబ్బంతాపెట్టి ఉల్లిపాయలు తెచ్చి, గదుల్లో నింపాడు.

నిజానికి ఆ సమయంలో ఉల్లిపాయకు గిరాకీ లేదు. ఆ యేడు ఉల్లిపాయ విపరీతంగా పండింది. దీనికి తోడు మిగిలిన వ్యాపారులు తమ వద్ద ఉన్న కాస్త సరుకును పూర్తిగా తక్కువ ధరకు అమ్మసాగారు. వాళ్ళు ఉల్లిపాయలు అమ్మే ధరచూస్తే కాశీపతికి తల తిరిగి పోయింది. అది కోస్తా ధరకన్న చాలా తక్కువ.

అతను వ్యాపారస్తులను, ఉల్లిపాయలను ఇంత తక్కువ ధరకు ఎందుకు అమ్ముతున్నారని అడిగాడు.

"ఏదో గిట్టుబాటును బట్టి అమ్ముతున్నాం. ఈ ధర మీదనే మాకు లాభం వస్తుంది. అయితే నీకు వచ్చిన తొందర ఏమిటి? సరుకు నష్టానికి అమ్మవద్దు. నాలుగు రోజులు పోతే, మా వద్ద ఉన్న సరుకు అయిపోయి, నీ సరుకుకు మంచి ధర పలుకుతుంది." అన్నారు.

కాశీపతి ఉల్లిపాయలు పోసిన గదులకు తాళాలు బిగించాడు. ఎన్ని రోజులు గడిచినా మార్కెటులో ఉల్లిపాయ కొరత



కనిపించలేదు. ఇదేమని అతను సాటి వ్యాపారస్తులను అడిగితే, "తొందరపడితే ఎలా? వ్యాపారం ధైర్యంగా చెయ్యాలి," అని వాళ్ళు తమలో తాము నవ్వుకున్నారు.

ఇంతలో కాశీపతి ఊహించని పరిణామం జరిగింది. అతని కొట్టుకు చుట్టుపక్కల ఉండేవాళ్ళందరూ అతన్ని నడివీధిలో నిలవేసి, కాకుల్లా పొడవసాగారు.

"నువు తక్షణం నీ గదులు ఖాళీ చెయ్యి. నీ ఉల్లిపాయలు కుళ్ళి కంపు కొట్టుతున్నాయి. ఆ వాసన భరించలేక చస్తున్నాం," అన్నారు వాళ్ళు.

ఉల్లిపాయల గదులు తెరిచిచూస్తే సరుకంతా దమ్మిడీ విలువ చెయ్యకుండా పోయినట్టు స్పష్టమయింది.

"ఉల్లిపాయకు గాలి తగలకపోతే కుళ్ళిపోతుందని తెలియని నువు కూడా వ్యాపారం చేసేవాడివేనా?" అని అందరూ కాశీపతిని అడిగారు.

తోటి వ్యాపారస్తులు తనను ఎలా మోసం చేశారో కాశీపతి గ్రహించాడు. అంతా దగా! మోసం! పట్నంలో పై మెరుగులు తప్ప ఇంకేమీ లేవు!

కాశీపతి కూలీలను పెట్టి కుళ్ళు సరుకంతా బయట పారేయించి, వట్టి చేతులతో ఇల్లు చేరుకున్నాడు.

"ఏం, కాశీపతీ? డబ్బు కావాలా?" అని అడిగాడు కరణంగారు.

"వద్దులెండి. మీ ఋణం తీర్చితే అదే పదివేలు," అన్నాడు కాశీపతి, జరిగిందంతా చెప్పి.

"సరే, నువు ఇలా మారగలందులకే అలా చేశాం. నేను నీ కిచ్చినది మీ నాన్న డబ్బే. మీ నాన్న నాకు బాకీ ఉన్న మాట నిజం కాదు." అన్నాడు కరణంగారు.

కాశీపతికి కొండంత బరువు దిగిపోయినట్టయింది. అతను తండ్రి అడుగు జాడలలో నడుస్తూ, ప్రజలతో మంచిగా జీవించటంలో ఉన్న ఆనందాన్ని చవి చూశాడు.



# బేరంలో సహకారం

ఒక నగరంలోని రద్దీకూడలిలో ఒక పళ్ళదుకాణం ఉండేది. వేసవికాలం కావటం చేత ఆ దుకాణం వాడు మామిడిపళ్ళు అమ్మకానికి పెట్టాడు.

ఒక రోజు ఒక మనిషి వచ్చి, పళ్ళవ్యాపారంలో తనకు పని ఇప్పించమని వ్యాపారిని కోరాడు. అందుకు వ్యాపారి ఒప్పుకోలేదు.

"పోనీ, మీ పళ్ళలో చిన్న సైజువి తీసి ఇయ్యండి. వాటిని అమ్మిపెట్టి, మీరిచ్చినది తీసుకుంటాను," అన్నాడు ఆ మనిషి. వ్యాపారి వాడికి కొన్ని పళ్ళు ఇచ్చాడు. ఆ మనిషి వాటిని ఆ సమీపంలోనే అమ్మకానికి పెట్టాడు.

పళ్ళ దుకాణంలో ఆ రోజు అమ్మకం మామూలుకన్న జోరుగా సాగింది. రెండోవాడు తీసుకుపోయిన పళ్ళన్నీ అలాగే తెచ్చి ఇచ్చి, తన కష్టానికి ఏదన్నా ఇయ్యమన్నాడు.

"నువు ఒక్క పండూ అమ్మలేదు." అన్నాడు వ్యాపారి.

"నేను అమ్మలేదు. కాని మీది అమ్ముడయేటట్టు చేశాను. నా చిన్న పళ్ళ ధర మీ పెద్ద పళ్ళ ధరకంటె హెచ్చు చెప్పాను. మీ పెద్ద పళ్ళు, కొనేవాళ్ళకు చౌక అనిపించి, ఎక్కువగా అమ్ముడయాయి," అన్నాడు వాడు.

అది నిజమేనని గ్రహించి వాడికి పళ్ళవ్యాపారి కొంత డబ్బు ఇచ్చాడు.

—మల్లాది వెంకటకృష్ణమూర్తి





# పాపపరిహారం

ఒక ఊళ్ళో శ్రీనివాసులు ఆలయం ఉండేది. ఆ ఆలయానికి చుట్టుపక్కల గ్రామాలవాళ్ళు కూడా ఎంతోమంది వచ్చేవారు.

ఒకరోజు రాత్రి అర్చకుడు గుడి మూసి, చేతిలో లాంతరు తీసుకుని ఇవతలికి వచ్చేసరికి, ఒక బక్క చిక్కన మనిషి వచ్చి, "అయ్యా, ఒక్కసారి గుడి తలుపులు తెరుస్తారా? దేవుడి దర్శనం చేసుకుని వెళ్ళిపోతాను?" అని వేడుకున్నాడు.

అర్చకుడు ఆ మనిషిని ఎగాదిగా చూసి, "పవళింపు సేవ అయిపోయింది. రేపు ఉదయమే తలుపులు తెరవడం," అన్నాడు.

"ఈ రాత్రి అంతా వేచి ఉండవలసిందేనా?" అని ఆ బక్క మనిషి గొణుక్కున్నాడు.

"ఈ రాత్రికి ఇక్కడే అరుగు మీద పడుకో," అని అర్చకుడు వెళ్ళిపోయాడు.

రోగిష్ఠి మనిషి చీకట్లో తడుముకుంటూ అరుగు మీద సర్దుకుని కూర్చున్నాడు. అతనికి తన గతం గుర్తుకురాసాగింది.

అతని పేరు చలపతి. అతను సంసారి అయాడుగాని సంపాదనపరుడు కాలేక పోయాడు. అతనికి ఒక ముసలి బంధువు ఉండేవాడు. ఆయన పోయాక ఆయన ఆస్తి అంతా తనకే వస్తుందని చలపతికి తెలుసు. అయితే బతికి ఉండగా ఆ ముసలాయన చలపతిని తన పంచన చేరనీయలేదు. ఆ ముసలివాడు ఎప్పుడు పోతాడా అని చలపతీ, అతని భార్య హనుమాయమ్మా గోతి దగ్గిర నక్కలల్లే కాచుకు కూర్చున్నారు.

ఒకరోజు ముసలివాడు పోనే పోయాడు. ఈ వార్త తెలియగానే భార్యాభర్తలిద్దరూ

ఎం. కామేశ్వరరావు

వెళ్ళారు. చలపతి చచ్చిపోయినవాడికి దహన సంస్కారాలు చేశాడు.

తరవాత భార్యాభర్తలు ఇల్లంతా గాలించినా ఎక్కడా ఎర్ర ఏగానీ కనిపించలేదు. పూజగదిలో పాతకాలపు శ్రీనివాసుడి రాగి విగ్రహం తప్పిస్తే ఆ ఇంట్లో మరే విలువైన వస్తువూ లేదు. ముసలివాడు తన డబ్బంతా ఏం చేశాడో చలపతికి అంతుబట్టలేదు.

"ఈ రాగి విగ్రహం కూడు పెడుతుందా, గుడ్డ పెడుతుందా? ఎందుకిది?" అంటూ చలపతి శ్రీనివాసులు విగ్రహాన్ని పారెయ్యబోయాడు.

హనుమాయమ్మ అతని చెయ్యి పట్టుకుని ఆపి, "మనకు బుర్ర ఉండాలి గాని, అన్నీ పెడుతుంది," అంటూ చలపతికి ఒక ఆలోచన చెప్పింది.

చలపతి ఆమెను మెచ్చుకుని, ఒక పాత గుడ్డలో ఆ విగ్రహాన్ని చుట్టబెట్టి, రహస్యంగా తన ఇంటికి తెచ్చేసుకున్నాడు.

మర్నాడు ఆ వూరంతా ఒక వార్త గుప్పుమన్నది - చలపతి ఇంటి వెనక తోటలో శ్రీనివాసుడు వెలిశాడు! హనుమాయమ్మ ఒంటిమీదికి దేవుడు వచ్చాడు! అంతే! జనం తండోప తండాలుగా రాసాగారు. మూఢ ప్రజలు విరివిగా కానుకలు కూడా అర్పించుకున్నారు.

హనుమాయమ్మ కళ్ళు మూసుకుని, జుట్టు విరబోసుకుని కూర్చున్నది.





భక్తులు అడిగిన ప్రశ్నలకు ఆమె శ్రీనివాసుడు ఇచ్చినట్టుగానే సమాధానా లిస్తున్నది. భక్తులు పరవశించిపోయారు. ఓపిక నశించిపోయాక, హనుమాయమ్మ మూర్ఛపోయినట్టు నటించి, లేచి కూర్చున్నది. దేవుడు దిగిపోయాడనుకుని మూర్ఖప్రజలు ఇళ్ళకు వెళ్ళిపోయారు.

కానుకలు లెక్క చూసుకుని, "బ్రహ్మాండమైన పథకం!" అంటూ భార్యాభర్తలు తమను తాము అభినందించుకున్నారు.

ఆ పాతకాలపు విగ్రహాన్ని ఇంటి మధ్య నడవలో ప్రతిష్ఠించారు. ప్రతి శనివారమూ హనుమాయమ్మ మీదికి శ్రీనివాసుడు వస్తున్నాడు. భక్తులను పలకరిస్తున్నాడు. ఈ వార్త చుట్టుపక్కల గ్రామాలకు కూడా వ్యాపించింది. జనం తండోపతండాలుగా రాసాగారు.

చలపతికి ఇంకా పెద్ద ఆలోచన కలిగింది. చిన్న చిన్న కానుకలతో లాభం లేదు. హుండీ ఒకటి ఉంచి, శ్రీనివాసుడికి గుడి కట్టించటానికి లోకులు తమకు తోచినది అందులో వేసే ఏర్పాటు ఆలోచించాడు. హనుమాయమ్మ ఈ ఆలోచనను మెచ్చుకున్నది.

మర్నాడు చలపతి ఒక పెద్ద రాగి బిందెను తెచ్చి, దానికి ఒక పసుపు గుడ్డ వాసెన కట్టి, విగ్రహం పక్కన పెట్టాడు. హనుమాయమ్మ భక్తులతో శ్రీనివాసుడు అన్నట్టుగా, "మీలో పుణ్యాత్ములు నా కోసం గుడి కట్టించండి. హుండీలో న్యాయంగా సంపాదించిన డబ్బే వెయ్యండి. అన్యాయపు డబ్బు హుండీలో పడగానే చిల్లపెంకులుగా మారిపోతుంది," అని చెప్పింది.

హుండీలో డబ్బు పడసాగింది. ఆరు మాసాల్లో హుండీ నిండింది.

"ఈ డబ్బు మనకు చాలు. దూర ప్రాంతాలకు పోయి దీనితో హాయిగా బతుకుదాం," అనుకున్నారు భార్యాభర్తలు.

కాని ఎవరికీ అనుమానం కలగకుండా ఆ బిందెను తరలించటం కష్టం. పది మంది వచ్చే, పోయే లోగిలి! బాగా ఆలోచించి హనుమాయమ్మ తన మొగుడి చేత అలాటి బిందే మరొకటి తెప్పించి, దానికి కూడా పసుపుగుడ్డ వాసెన కట్టి, దాని నిండా చిల్లపెంకులు నింపి, విగ్రహం పక్కన పెట్టి, అసలు బిందెను పాతగుడ్డలో చుట్టి వేరుగా పెట్టాలన్నది.

"అర్థరాత్రి దాటాక చల్లగా జారుకుందాం. పిచ్చిభక్తులు తమ డబ్బు అన్యాయార్జితం కావటంచేత చిల్లపెంకులుగా మారాయనీ, అందుకే మనం ఇక్కడ ఉండటం ఇష్టంలేక వెళ్లిపోయామనీ అనుకుంటారు," అన్నది హనుమాయమ్మ.

చీకటిపడగానే చలపతి దొడ్లోకి వెళ్ళి, చిల్లపెంకులు ఏరి కొత్తబిందెలో పోసి, పాతబిందెను తీసుకుపోయి తలుపువార పెట్టి, కొత్తబిందెను విగ్రహం పక్కన పెట్టాడు. ఈ లోపల హనుమాయమ్మ నిద్రపోయింది.

చలపతికి ఒక అనుమానం వచ్చింది. భక్తులందరిదీ అన్యాయార్జితం అయి ఉండదు కదా! అందుచేత అతను పాత బిందె నుంచి దోసెడు నాణాలు తీసి, కొత్త బిందెలోని చిల్లపెంకుల మీద పోసి, తాను కూడా కాసేపు నడుంవాల్చాడు.

భార్య లేపినదాకా అతనికి మెలకువ రాలేదు. అప్పటికి మూడోఝాము జరుగుతున్నది. తొలికోడి కూయకముందే పొలి



మేర దాటిపోవటం మంచిది. లేకపోతే పొలం పనులకు పోయేవాళ్ళు చూస్తారు.

చలపతి కంగారుగా లేచి పాతపంచెలో తలుపువార ఉన్న బిందెను చుట్టి నెత్తిన పెట్టుకుని బయలుదేరాడు. ఇద్దరూ బయలుదేరి తెల్లవారేసరికి ఊరు దాటి చాలా దూరం వెళ్ళారు. మధ్యాన్నంవేళ కాస్సేపు విశ్రాంతి తీసుకుని, ఏ ఊరయినా చేరేలోపుగా కొంత డబ్బు దగ్గిర ఉంచుకుందామని, బిందె వాసెన విప్పారు.

ఇద్దరి ప్రాణాలూ ఒక్కసారి ఆక్రోశించాయి. పైన కొద్దినాణాలు తప్పిస్తే బిందెనిండా చిల్లపెంకులే!

జరిగినదేమంటే, హనుమాయమ్మ నిద్ర లేస్తూనే బిందెలు మారాయో లేదో అని చూడటానికి, విగ్రహం పక్కన ఉన్న బిందెలో చెయ్యిపెట్టింది. పైన చలపతి పోసిన నాణాలు ఆమె చేతికి తగిలాయి. అదే అసలు బిందె అనుకుని, ఆమె దాన్ని తలుపువారపెట్టి, అక్కడ ఉన్న అసలు బింనెను విగ్రహం పక్కన పెట్టింది.

జరిగిన పొరపాటు అర్థంకాగానే హనుమాయమ్మకు మతిచలించింది. ఆమె త్వరలోనే మంచానపడి మరణించింది. చలపతి చావలేదు గాని, కుక్క కన్న హీనంగా బతికి, తాను చేసిన పాపాలను గురించి ఎంతో మనోవేదనపడ్డాడు. తాము విడిచిపెట్టివెళ్లిన డబ్బుతో లోకులు నిజంగా గుడి కట్టించిఉంటే, దేవుణ్ణి ఒక్కసారి చూసి, తన పాపాన్ని పరిహారం చేసుకోవాలని అతనికి గాఢమైన కోరిక కలిగింది. ఒంట్లో శక్తిలేకపోయినా, అష్టకష్టాలుపడి చలపతి తన ఊరికి తిరిగి వచ్చాడు. తమ ఇంటిస్థానంలో అందమైన గుడి కనిపించింది. అతనికి ఆనందం కలిగింది. కాని దేవుడి దర్శనంకాలేదు.

"తెల్లవారగానే దేవుణ్ణి దర్శించుకుని క్షమాపణ చెప్పుకోవాలి! పాపపరిహారం చేసుకోవాలి," అనుకుంటూ చలపతి అరుగు మీద పడుకున్నాడు.

కాని అది సాధ్యపడలేదు. అలా పడుకున్న చలపతి మరి లేవలేదు.






# దొంగలు

ఒక ఊళ్ళో భూషయ్య అనే భూస్వామికి విరూపు డనే పెళ్ళీడు వచ్చిన కొడుకు ఉండేవాడు. అతను రాత్రివేళ తమ ఇంటి వెనక రావిచెట్టు కింద నిద్రపోయే వాడు. తెల్లవారి లేస్తూనే చెట్టు మీది పక్షులను చూసి ఆనందించేవాడు.

ఒకరోజు ఉదయం విరూపుడు నిద్ర లేస్తూనే చెట్టు కేసి చూసి, కెవ్వున అరిచి, స్పృహతప్పి పడిపోయాడు. ఆ కేకకు భూషయ్య ఇంట్లో నుంచి వచ్చి, కట్టెలా పడిఉన్న కొడుకును నౌకర్ల చేత ఇంట్లోకి చేర్పించాడు.

కొద్దిసేపటికి విరూపుడికి స్పృహ వచ్చింది గాని, అతను పిచ్చిచూపులు చూస్తూ, మతితప్పినవాడిలా మాట్లాడ సాగాడు. విరూపుడి స్థితిచూసి భూషయ్య కంగారుపడటానికి మరోకారణం ఏమంటే ఆ రోజే ఎవరో అతన్ని పెళ్ళిచూపులు చూడవస్తున్నారు. భూషయ్య వాళ్ళకు ఒకవారం తరవాత రమ్మని కబురు చేసి, పక్కింటి వైద్యుడు కరటయ్యను పిలిపించాడు.

కరటయ్య పిల్లవాణ్ణి పరీక్షించి, "అనారోగ్యం ఏమీలేదు. ఏ కామినీపిశాచమన్నా పట్టుకున్నదేమో? లేక ఏ దయ్యాన్నో, భూతాన్నో చూసి దడుచుకున్నాడో? మతంలోకి కొత్తగా వచ్చిన సాధువును చూద్దాం పదండి," అన్నాడు భూషయ్యతో.

ఇద్దరూ మఠానికి వెళ్ళారు. ఆ సమయానికి దయ్యంపట్టినవాడొకడు సాధువు చుట్టూ గిరికీలు కొడుతున్నాడు. సాధువు వాణ్ణి తన చేతిబెత్తంతో తల మీద మూడు సార్లు తాటించాడు. వెంటనే దయ్యం దిగిపోయింది. భూషయ్యకు సాధువు మీద గురికుదిరి, అయనకు తాను వచ్చినపని చెప్పాడు.

వీరేపల్లి జయరాంరెడ్డి



శరభయ్య విరూపుణ్ణి చూడగానే పెదవి విరిచి, ''ఈ చికిత్స నా వల్లకాదు. నా కంత శక్తి లేదు,'' అన్నాడు. అతను వెళ్ళాక సాంబయ్య, ''నేను చికిత్స చేస్తాను. ఇది ఎవడి పనో, ఈ రాత్రి అంజనం వేసి నేను కనుక్కుంటాను. శరభయ్య డబ్బుకి గడ్డి తింటాడు. ఈ పాడుపని వాడిదే అని నా అనుమానం అందుకే తన వల్ల కాదని చెప్పి, చల్లగా జారుకున్నాడు. ఈ దెబ్బతో వాడి అంతు తేల్చుతాను,'' అన్నాడు.

గ్రామంలో ఇద్దరు భూతవైద్యులకూ బద్ధవైరం.

సాంబయ్యను పంపించి, భూషయ్య సాధువు దగ్గిరికి పరిగెత్తి, చికిత్స చెయ్యటానికి సాంబయ్య ఒప్పుకోవటమే గాక, ఇది శరభయ్య పనే అని శంకిస్తున్నట్టు కూడా తెలిపాడు.

సాధువు అంతావిని కళ్ళుమూసుకుని తెరిచి, ''నీ కొడుక్కు ఏ దయ్యమూ, భూతమూ పట్టలేదు. ఎవరో గిట్టనివాళ్ళు చేతబడి చేయించారు. మీ ఊళ్లో ఎంత మంది మంత్రగాళ్లున్నారు?" అనిఅడిగాడు.

''ఇద్దరే, స్వామీ! శరభయ్యా, సాంబయ్యా!'' అన్నాడు భూషయ్య.

''వారిలో ఒకరు ఈ పని చేసి ఉండాలి. నీ కొడుక్కు చికిత్స చెయ్యమని ఇద్దర్నీ అడుగు. ఎవరు వైద్యం చెయ్యటానికి ఒప్పుకుంటే వాడిపేరు నాకు వచ్చిచెప్పు,'' అన్నాడు సాధువు.

భూషయ్యా, కరటయ్యా ఇంటికి తిరిగి వచ్చి, భూతవైద్యులిద్దరినీ పిలిపించారు.

సాధువు తల అడ్డంగాతిప్పి, ''నువ్వు శరభయ్యనే శంకిస్తున్నావు. కాని నా దివ్య దృష్టితో చూస్తే నీ కొడుక్కు చేతబడి చేసినది సాంబయ్యే అని తెలిసిపోతున్నది. ఈ రాత్రికి అంజనం వేసే సాకుతో నీ కొడుకు ప్రాణాలు తీసే ప్రయత్నం చెయ్యబోతాడు. నా మాట విని, నీ కొడుకును దక్కించుకో!'' అన్నాడు.

అందుకు ఏం చెయ్యాలో భూషయ్య సాధువు వల్ల తెలుసుకున్నాడు. ఆ రాత్రి

భూషయ్యా, పక్కింటి వైద్యుడు కరటయ్యా, మరో ఇద్దరు మనుషులూ సాంబయ్య ఇంటి వైపువెళ్ళి, సమీపంలో మాటువేశారు.

అర్థరాత్రి దాటాక సాంబయ్య నట్టింట ముగ్గులు వేసి, ముగ్గుల మధ్య చచ్చిన పామును తెచ్చి చుట్టగా చుట్టిపెట్టి, దాని మీద ఒక పుర్రెను ఉంచి, పుర్రె పైన ఒక నిమ్మకాయను నిలబెట్టాడు. తరవాత ఇల్లంతా కమ్ముకునేటట్టు ధూపంవేసి, తన వేలు కోసుకుని, తన రక్తంతో పుర్రెకు బొట్లు పెట్టాడు. ఇది పూర్తి అయాక సాంబయ్య ముగ్గు ముందు కూర్చోబోతూండగా, దాగి ఉన్న నలుగురు మనుషులూ లోపలికి జొరబడి, సాంబయ్యను కట్టేసి, చావబాది, సాధువు దగ్గిరికి లాక్కువెళ్ళారు.

చేసిన తప్పు ఒప్పుకోమని వాళ్ళు నిర్బంధించేసరికి సాంబయ్య, "మహా ప్రభో! దేవుడి తోడు, నే నేమీ చెయ్యలేదు. ఆ పాపిష్ఠి ప్రయోగం ఎవరు చేశారో కూడా నాకు తెలీదు. అది తెలుసుకునేందుకే అంజనం వెయ్యబోతూండగా వీళ్ళు నన్ను చావగొట్టి లాక్కొచ్చారు," అని ఏడ్చాడు.

భూషయ్య మనుషులు సాంబయ్యను మళ్ళీ కొట్టబోతూండగా, "ఆగండి!" అంటూ శరభయ్య విరూపుణ్ణి వెంటబెట్టుకుని అక్కడికి వచ్చి, "కొట్టవలసింది సాంబయ్యను కాదు, నిజంగా చేతబడి



చేసి, సాధువు వేషంలో ఉన్న ఈ పోరుగూరి మంత్రగాణ్ణి! దుర్మార్గం చేసింది చాలక, అందులో నన్నూ, సాంబయ్యనూ ఇరికించాలని చూశాడు. నేను మొదటి నుంచీ వీణ్ణి అనుమానిస్తూనే ఉన్నాను.'' అన్నాడు.

సాధువు మెల్లిగా జారుకోబోయాడు. కాని శరభయ్యా, విరూపుడూ వాణ్ణి పట్టుకుని, నాలుగు తగిలించారు.

వాడు మొర్రోమంటూ, ''అయ్యా, బుద్ధి గడ్డితిని ఆ పాడుపని చేసింది నేనే గాని, నా చేత ఆ పని చేయించిన పెద్ద మనిషి ఇక్కడే ఉన్నాడు,'' అని కరటయ్యను చూపించాడు.

కరటయ్య మొహం నల్లగాఅయింది.

భూషయ్య అతని కేసి అసహ్యంగా చూస్తూ, ''ఇదంతా చివరకు నీ పనా? ఎందుకు చేయించావీ ముదనష్టపు పని?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు విరూపుడు సమాధానం చెబుతూ ఇలా అన్నాడు:

''కరటయ్య పిసినిగొట్టుతనం అందరికీ తెలిసినదే. తన ఒక్క కూతురినీ నా కియ్యాలనుకున్నాడు. పెళ్ళి అన్నాక చాలా ఖర్చు అవుతుంది. పైసా ఖర్చు కాకుండా నన్ను అల్లుణ్ణి చేసుకోవటానికి ఈ సాధువు చేత ప్రయోగం చేయించాడు. నేను పిచ్చివాణ్ణి అంటే సంబంధాలు రావు. దమ్మిడీ ఖర్చుకాకుండా నాకూ, తన కూతురికీ పెళ్ళిచేసేసి, తరవాత నన్ను మామూలుమనిషిని చేసుకుందామని కరటయ్య దురాశపడ్డాడు. నాకు మతి పోయింది చెట్టు మీద కనిపించిన దిష్టి బొమ్మను చూసి! శరభయ్య ధర్మమా అంటూ నేను మళ్ళీ మామూలుమనిషిని అయాను.''

కరటయ్య తాను చేసిన పనికి సిగ్గుతో తల వంచుకున్నాడు. ఈ అవమానంతో అతనికి బుద్ధి వచ్చింది. తరవాత పెట్టవలసిన ఖర్చేదోపెట్టి కరటయ్య తన కూతుర్ని విరూపుడికే ఇచ్చి వైభవంగా పెళ్ళిచేశాడు.





# వీర హనుమాన్

మహోదరుడు అలా అన్నమీదట కుంభకర్ణుడు రాక్షసుల వెంట రావణుడి ఇంటికి వెళ్ళాడు. రాక్షసులు ముందుగా రావణుడి వద్దకు వెళ్ళి, "కుంభకర్ణుడు నిద్ర లేచాడు. అతనికి ఏం ఆజ్ఞ ఇస్తావు? అలాగే యుద్ధానికి పొమ్మన్నావా? ఇక్కడికి వచ్చి నిన్ను చూడమన్నావా?" అని అడిగారు.

"నేను కుంభకర్ణుణ్ణి చూడాలి. అతన్ని మర్యాదగా ఇక్కడికి తీసుకురండి," అన్నాడు రావణుడు.

రాక్షసులు వెళ్ళి ఈ మాట చెప్పగానే కుంభకర్ణుడు రావణుడి వద్దకు వచ్చాడు.

కుంభకర్ణుణ్ణి ప్రాకారాల వెలపల ఉన్న వానరులు చూసి భయపడి, అటూ ఇటూ పరిగెత్తారు. కుంభకర్ణుణ్ణి రాముడు కూడా చూశాడు, వానరసేన పరిగెత్తటమూ చూశాడు. అతను విభీషణుడితో, "పెద్ద మేఘంలాగున్నాడు. ఎవరితడు?" అన్నాడు.

విభీషణుడు రాముడితో ఇలా అన్నాడు:

"ఇతను విశ్రవసుడి కొడుకు కుంభకర్ణుడు. యుద్ధంలో యముణ్ణీ, ఇంద్రుణ్ణీ కూడా జయించినవాడు. ఇతని దేహమంత పెద్ద దేహం మరే రాక్షసుడికీ లేదు. ఇతర రాక్షసులు వరాలు పొంది బలవంతులయారు కాని, కుంభకర్ణుడు పుట్టుకతోనే మహా పరాక్రమశాలి. ఇతను పుట్టుతూనే ఆకలికొద్దీ అనేకవేల ప్రాణులను భక్షించాడు. ఇది చూసి ప్రజలు బెదిరిపోయి

## 26. కుంభకర్ణుడి యుద్ధం




ఇంద్రుడితో చెప్పి, అతని శరణు జొచ్చారు. ఇంద్రుడు కోపించి, కుంభకర్ణుణ్ణి వజ్రాయుధంతో కొట్టాడు. కుంభకర్ణుడు సింహనాదం చేశాడు. ఆ ధ్వనికి ప్రజలు మరింత హడలిపోయారు. కుంభకర్ణుడు ఐరావతం దంతం ఒకటి పీకి, దానితో ఇంద్రుణ్ణి రొమ్ములో పొడిచాడు. తరవాత ఇంద్రుడు ప్రజలను వెంటబెట్టుకుని బ్రహ్మదేవుడి వద్దకు వెళ్ళి సంగతి చెప్పుకున్నాడు. బ్రహ్మదేవుడు రాక్షసులనందరినీ పిలిపించాడు. వారిలో కుంభకర్ణుడు కనిపించేసరికి బ్రహ్మకే భయం పుట్టింది. బ్రహ్మ కుంభకర్ణుడితో, 'లోకాలు నాశనం చెయ్యటానికి విశ్రవసుడు నిన్ను కన్నాడురా! నువ్వు సర్వకాల సర్వావస్థలయందూ ఒళ్ళు తెలియకుండా పడి ఉండి నిద్రపో!' అన్నాడు. ఆ శాపం తగిలి కుంభకర్ణుడు బ్రహ్మ ఎదటనే పడిపోయాడు. అది చూసి రావణుడు బ్రహ్మతో, 'నీ మునిమనమడయిన ఈ కుంభకర్ణుణ్ణి ఇలా శపించటం భావ్యం కాదు. నీ మాట అబద్ధం కావటానికి లేదు. వాడు నిద్రపోవటానికీ, మేలుకుని ఉండటానికీ కాల నియమం ఏర్పాటు చెయ్యి.' అన్నాడు. అప్పుడు బ్రహ్మ కుంభకర్ణుడు ఆరు మాసాలు నిద్రపోయేటట్టూ, ఒక్క రోజు మేలుకుని ఉండేటట్టూ, నిద్ర లేచినప్పుడు ఆకలితో ఎదట కనిపించినదంతా అగ్నిహోత్రుడిలాగా తినేటట్టూ నియమం పెట్టాడు.

"నీ పరాక్రమానికి బెదిరిపోయి రావణుడు కుంభకర్ణుణ్ణి నిద్ర లేపించాడు. మహా భయంకర పరాక్రముడైన కుంభకర్ణుడు వానరులను తినటానికి వస్తాడు. వానరులు అతన్ని ఎలా ఎదిరించగలరు? అది ఒక కదిలే యంత్రమని వానరులకు చెప్పాలి. అప్పుడుగాని వారి భయం పోదు."

రాముడు విభీషణుడు చెప్పినది విని తృప్తిపడి, నీలుడితో లంకా ద్వారాలన్నిటిపైనా దాడి సాగించమన్నాడు. గవాక్షుడూ,



హనుమంతుడూ, అంగదుడూ పర్వత శిఖరాలను తీసుకుని యుద్ధానికి వచ్చారు.

ఈ లోపల కుంభకర్ణుడు పూర్తిగా వదలని నిద్రమత్తుతో రావణుడి వద్దకు వచ్చి, అతను విచారంగా ఉండటం గమనించాడు. కుంభకర్ణుణ్ణి చూసి, రావణుడు పరమానందంతో ఆసనం నుంచి లేచి, కుంభకర్ణుణ్ణి కౌగలించుకుని, ఇద్దరూ కూర్చున్న అనంతరం, కుంభకర్ణుడు, "ఏం తొందర కలిగింది? నిద్రపోతున్న నన్ను ఎందుకు లేపించావు? నీ కిప్పుడు ఎవడు భయం కలిగించాడు? వాడికి చావు దగ్గిరపడింది!" అన్నాడు.

దానికి రావణుడు, "నాకు రాముడి వల్ల భయం కలిగింది. అతను సుగ్రీవుడితోనూ, వానరసేనతోనూ, సముద్రం దాటి వచ్చి, మనని సర్వనాశనం చేస్తున్నాడు. యుద్ధంలో వానరవీరుడు ఒక్కడూ చావలేదుగాని, వానరుల చేతిలో రాక్షస వీరులు చాలామంది చచ్చారు. అందుచేత ఇప్పుడు నువు వానరులనందరినీ చంపి, లంకను కాపాడు. అందుకే నిన్ను నిద్ర లేపాను," అన్నాడు.

కుంభకర్ణుడు నవ్వి, "ముందు మనం సమాలోచన చేసినప్పుడు ఎలా జరుగుతుందనుకున్నామో, అలాగే జరిగింది. సీతను అపహరించి తెచ్చిన పాపానికి ఫలితం వెంటనే కనబడింది. ఈ విషయంలో మన తమ్ముడు విభీషణుడు చెప్పినదే మనకు హితమైనది. లేదా, నీకు ఇంకేమైనా తోస్తే అలా చెయ్యి," అన్నాడు.

రావణుడు కోపంగా, "నా కన్న చిన్నవాడివి నాకు బోధలు చేస్తున్నావేమిటి? ఇది నీతి గురించి ఆలోచించే సమయం కాదు. పరాక్రమం చూపే సమయం," అన్నాడు.

దానికి కుంభకర్ణుడు, "రాక్షసరాజా, నేను నీకు తమ్ముణ్ణి, బంధువును. నీకు హితం చెప్పటం నా విధి. ఇక నీకు

కలిగిన విచారం మాటకు వస్తే నువు నిశ్చింతగా ఉండు. రామ లక్ష్మణులను చంపి, వానర సేన పారిపోయేటట్టు చేస్తాను. తమ బంధువులు పోయినందుకు దుఃఖించే రాక్షసులందరికీ సంతోషం కలిగిస్తాను. నేను బతికి ఉండగా రాముడు నిన్ను చంపలేడు,'' అన్నాడు.

మహోదరుడు కుంభకర్ణుణ్ణి మందలిస్తూ ఇలా అన్నాడు:

''రావణుడు సీతను ఎత్తుకువద్దామనుకున్నప్పుడు అందుకు మేమంతా ఆమోదించాం. ఎవరి హితమూ వినకుండా రావణుడు ఆ పని చెయ్యలేదు. నువు ఇప్పుడు నీ పరాక్రమం గొప్పగా చెప్పుకుని, ఒక్కడివే యుద్ధానికి పోతానంటున్నావు. అదికూడా సముచితంగా లేదు. జనస్థానంలో అనేకమంది రాక్షసులను ఒంటరిగా చంపిన రాముణ్ణి నువు ఒక్కడివే ఎలా చంపుతావు? ఆ జనస్థానంలో రాముడికి ఓడిన మహాపరాక్రమవంతులైన రాక్షసులు ఇప్పటికీ రాముడి పేరు చెబితే భయపడుతున్నారు, చూడు.''

తరవాత మహోదరుడు రావణుడితో, ''నువు మమ్మల్ని కొందరిని యుద్ధానికి పంపు. మేం రాముణ్ణి చంపితే సరేసరి, లేకపోతే తిరిగివచ్చి, రాముణ్ణి తినేశామని చెబుతాం. నువు బహిరంగంగా పండగ



జరుపు. సీతను భర్త పోయినందుకు పరామర్శించు, నీదాన్ని చేసుకో. యుద్ధంతో పనేలేకుండా నీ కోరిక తీరిపోతుంది!'' అన్నాడు.

మహోదరుణ్ణి చూస్తే కుంభకర్ణుడికి మండిపోయింది. అతను మహోదరుడితో, ''ఇలాటి మాటలు ఇంకెన్నడూ చెప్పకు. జాగ్రత్త! పిరికివాళ్ళూ, బుద్ధిహీనులూ అయిన నీలాటివాళ్ళ మాటలు వినటం చేతనే రావణుడికి ఈ ఆపద వచ్చిపడింది. మీకు యుద్ధమంటేనే భయం. రాజు చెప్పిన దానికంతకూ తాళం వేస్తూ, ఇచ్చకాలాడటంమూలాన వ్యవహారం ఇంతదూరం వచ్చింది. మీ మూలంగా



లంక దాదాపు నాశనమయింది. బొక్కసం ఖాళీ అయింది. సైన్యమంతా తుడిచిపెట్టుకుపోయింది. మీరు రాజును శత్రువుగా చూసినట్టున్నది. మీరు చేసిన తప్పులు సరిచెయ్యటానికి నేను యుద్ధభూమికి పోతున్నాను,'' అన్నాడు.

కుంభకర్ణుడి మాటలకు రావణుడు పకపకా నవ్వి, ''మహోదరుడికి రాముడంటే భయం. అందుకే యుద్ధం వద్దంటాడు. నాకు నీ కన్న దగ్గరవాడూ, నీ అంత బలవంతుడూ మరొకడు లేడు. నువు వెంటనే యుద్ధానికి బయలుదేరు, వానరులను భక్షించు, యుద్ధంలో జయం పొందిరా. అసలు నిన్ను చూస్తూనే వానరులు పారిపోతారు; రామలక్ష్మణుల గుండెలు పగిలిపోతాయి,'' అన్నాడు.

కుంభకర్ణుడు యుద్ధానికి పోవటానికి సిద్ధపడుతూ, మంచి వాడి గల శూలాన్ని చేపట్టాడు. అది ఇనుముతో చేసినది. దానికి మెరిసే బంగారు అలంకరణలున్నాయి. ఆ శూలాన్ని చేబట్టి కుంభకర్ణుడు రావణుడితో, ''నేను ఒంటరిగానే పోతాను. నా సేనను ఇక్కడే ఉండనీ. నన్ను చూసి భయపడిన వానరులనందరినీ తినేస్తాను.'' అన్నాడు.

"సాయుధసైనికులను వెంటబెట్టుకుని వెళ్ళు. వానరులు చాలా పరాక్రమవంతులు, వేగవంతులు, పట్టుదల గల వాళ్ళు. ఒంటరిగా, ఏమరుపాటున ఉన్న వాణ్ణి చంపెయ్యగలరు,'' అన్నాడు రావణుడు.

అతను కుంభకర్ణుణ్ణి తన చేతుల మీదుగా అలంకరించాడు. కుంభకర్ణుడు కవచం ధరించి, రావణుణ్ణి కౌగలించుకుని, రావణుడి ఆశీర్వాదం పొంది, యుద్ధానికి బయలుదేరాడు. అతని వెంట రథాలమీద అనేకమంది, సైన్యంతో సహా, శంఖాలూ, భేరీలూ మోగిస్తూ బయలుదేరారు.

దారిలో కుంభకర్ణుడు రాక్షసులతో, ''వానరులు మన కేమీ అపకారం చెయ్య

లేదు. అవి వనాలకు అలంకారంగా కూడా ఉంటాయి. ఇప్పుడు వానరులు లంకను ముట్టడించటానికి కారణం రామ, లక్ష్మణులు. అందుచేత యుద్ధంలో వారిద్దరినీ చంపేస్తాను,'' అన్నాడు.

కుంభకర్ణుణ్ణి చూడగానే వానరసేన చెల్లాచెదురుగా పారిపోయింది. అది చూసి కుంభకర్ణుడు చాలా సంతోషించాడు.

అంగదుడు వానరుల భయం గమనించి, నల, నీల, గవాక్ష, కుముదులతో, ''మీరు మీ స్వరూపాలనూ, పరాక్రమాలనూ, వంశాలనూ మరచి, మామూలు కోతుల్లాగా భయపడి ఎక్కడికి పోతారు? వెనక్కు తిరగండి. మీ కిప్పుడు ప్రాణభయం పట్టుకున్నాదా ఏం? ఆ కనిపించేది యోధుడు కాడు, మనని భయపెట్టటానికి తయారుచేసిన యంత్రం. దీన్ని మనం నాశనం చేతాం,'' అన్నాడు.

ఆ మాటతో వానరులు ధైర్యం తెచ్చుకుని, చెట్లూ, రాళ్ళూ తీసుకుని యుద్ధభూమికి వెళ్లారు. వాళ్లు మదపుటేనుగుల లాగా కుంభకర్ణుడి మీద యుద్ధం చేశారు. అయితే వాళ్ళు వేసిన చెట్లూ, రాళ్ళూ కుంభకర్ణుణ్ణి కదిలించలేకపోయాయి. అతను వానరులను చంపసాగాడు.

ఈసారి వానరులు కుంభకర్ణుడి చేత దెబ్బతిని, వెనక్కు తిరిగి చూడకుండా



అతివేగంగా పారిపోయారు. కొందరు వెళ్లి సముద్రంలో దూకారు. కొందరు గాలిలోకి ఎగిరారు. మరికొందరు తాము వచ్చిన సేతువు మీదుగానే పారిపోయారు.

అంగదుడు పారిపోవద్దని వారిని హెచ్చరించాడు. ఇన్నివేలమంది వానరులు ఒక్క కుంభకర్ణుడికి భయపడటమేమిటన్నాడు. కాని వానరులు తమకు ప్రాణాలుదక్కితే చాలునన్నారు. అయినా అంగదుడు మంచి మాటలతో వారిని వెనక్కు మళ్ళించాడు. అతనికి హనుమంతుడు కూడా సహాయం వచ్చాడు.

తరవాత హనుమంతుడి నాయకత్వం కింద ఋషభుడూ, శరభుడూ, మైందుడూ,

ధూమ్రుడూ, నీలుడూ, కుముదుడూ, సుషేణుడూ, గవాక్షుడూ, రంభుడూ, తారుడూ, ద్వివిదుడూ, పనసుడూ యుద్ధానికి బయలుదేరారు. వాళ్ళు చావటానికి కూడా సిద్ధంగా ఉన్నారు.

ఈ లోపల కుంభకర్ణుడు వానరులను తినసాగాడు. ద్వివిదుడు ఒక కొండను పెకలించి, కుంభకర్ణుడి పైకి వెళ్ళాడు. అతను విసిరిన ఆ కొండ గురి తప్పి, కుంభకర్ణుడి వెంట ఉన్న సేనపైన పడింది. దానికిందపడి రథాలూ, గుర్రాలూ, రాక్షసులూ నుగ్గయిపోయారు. ఇంతలో ద్వివిదుడు మరొక పర్వతశిఖరాన్ని విసిరాడు. అదికూడా అంతులేని విధ్వంసం చేసింది. రాక్షసరథికులు వానరులను చంపారు; వానరులు మహావృక్షాలతో రాక్షసులను చంపారు.

హనుమంతుడు ఆకాశంలో నుంచి కుంభకర్ణుడి మీద రకరకాల శిలలనూ, వృక్షాలనూ వర్షించాడు. కుంభకర్ణుడు తన శూలంతో పర్వతాలను పగలగొట్టి, చెట్లను పక్కకు నెట్టేశాడు. తరవాత అతను ఆ శూలం చేతబట్టి వానరసేనను తరుముతూంటే, హనుమంతుడు ఒక కొండతో అతన్ని బలంగాకొట్టాడు.

కుంభకర్ణుడి శరీరం గాయమై, రక్తం కారింది. అతను తన శూలాన్ని గిరగిరా తిప్పి హనుమంతుడి రొమ్ములో పొడిచాడు. హనుమంతుడు భయంకరంగా అరిచి, నోట నెత్తురుకక్కుతూ, మూర్ఛపోయాడు.

నీలుడు కుంభకర్ణుడి మీదకు మరొక పర్వతశిఖరం విసిరాడు. కుంభకర్ణుడు దాన్ని తన పిడికిలితో పొడిచి, నుగ్గు చేశాడు. ఋషభుడూ, శరభుడూ, నీలుడూ, గవాక్షుడూ, గంధమాదనుడూ ఈ అయిదుగురూ ఒక్కసారిగా కుంభకర్ణుడి పైకి వెళ్ళి, చుట్టుముట్టి, రాళ్ళతోనూ, చెట్లతోనూ, పిడికిళ్ళతోనూ, కాళ్ళతోనూ కొట్టారు. ఆ దెబ్బలు కుంభకర్ణుడికి సుఖంగాతోచాయి. అతను ఆ అయిదుగురు వానరవీరులనూ, ఒకరి తరవాత ఒకరుగా నెత్తురు కక్కించి, నేల కూల్చాడు.






మరాఠీ మహావీరుడైన శివాజీ ఢిల్లీలోని మొగలు చక్రవర్తికీ, మొగలు సామ్రాజ్యంలోని వేరు వేరు ప్రాంతాల పాలకులకూ పక్కలో బల్లెమయాడు.

అది 1660. శివాజీ పన్హాలాదుర్గంలో ఉంటున్నాడు. ఆ కోటను శివాజీతో సహా పట్టుకోమని బిజాపూరు సుల్తాను సలాబత్‌ఖాన్‌ను కొంతసేనతో పంపాడు. చాలా రోజులపాటు కోట ముట్టడి సాగింది.





ఒకరోజు శివాజీ మనుషులు తెల్ల జెండాలు పట్టుకుని కోట వెలుపడి వచ్చి, ఏ షరతులపైన ముట్టడి ఎత్తేస్తావని సలాబత్‌ఖాన్‌ను అడిగారు.



శివాజీ మనుషులు సలాబత్‌ఖాన్‌తో మంతనాలు జరుపుతూన్న సమయంలో శివాజీ ముసలివాడి వేషం వేసుకుని, కొందరువీరులైన అనుచరులతోసహా కోట వెనుకద్వారంకుండా పారిపోయాడు. కొంతదూరాన వారి కోసం గుర్రాలు సిద్ధంగా ఉన్నాయి.



అయితే శివాజీ, అతని అనుచరులూ తమ మారువేషాలు తీసేసి, గుర్రాల మీద ఎక్కగానే ఒక శత్రుగూఢచారి వారిని చూశాడు. సలాబత్‌ఖాన్ సైన్యంతో సహా వారి వెంటపడ్డాడు.



అదావుడిగా, శివాజీ కొరకూ, అతని అనుచరుల కొరకూ ఎన్నిక చేసిన గుర్రాలు అంతమంచివికావు సలాబత్‌ఖాన్, మరికొందరు సైనికులూ త్వరలోనే వారిని చేరుకున్నారు. యుద్ధం జరిగింది. అయితే శివాజీ తేలికగా శత్రువులను ఓడించాడు.

శివాజీ వెంట ఉన్నవారిలో, బాజీప్రభువు అనే విశ్వాసపాత్రుడూ, వీరుడూ అయిన మిత్రుడున్నాడు. అతను శివాజీతో రహస్యంగా, "మొత్తం సేన వచ్చి చేరగానే ఖాన్ మన మీద మళ్ళీ దెబ్బ తీస్తాడు. మనం వేగంగా కొండల కేసి వెళ్ళాలి," అన్నాడు.





సలాబత్‌ఖాన్ మళ్ళీ తమ మీదికి వచ్చే సరికి వాళ్ళు . ఇరుకైన ఘోడ్‌ఖింద్ కనుమ చేరారు. ఈసారి ఖాన్ వెంట పెద్దసేన ఉన్నది. బాజీ శివాజీని కనుమ దాటి విశాలగడ్ దుర్గానికి వెళ్ళేటట్టు ఒప్పించాడు. తాను క్షేమంగాచేరినట్టు గుర్తుగా శివాజీ తన ఫిరంగిని మూడు సార్లు పేల్చుతానన్నాడు.

బాజీ, అతని అనుచరులూ శత్రుసేనను చాలా చీకాకుపెట్టారు. ఇరుకైన కనుమ లోకి శత్రువు ప్రవేశించకుండా అడ్డటమో, కొంతమంది సైనికులను లోనికిరానిచ్చి, కొండరాళ్ళతో వారిని చితకగొట్టటమో చేశారు.





ఇన్ని తిప్పలు పెట్టినా శత్రువులు కనుమ లోకి చొచ్చుకురావటం జరిగినప్పుడు, బాజీ సాహసంతో వారి మధ్య దూకి, వారి దృష్టి మళ్లించి, వారికి చిక్కకుండా కనుమలోకి పారిపోయాడు.

ఈ విధంగా, తమ నాయకుడైన శివాజీ విశాలగఢ్ చేరే అవకాశం కలిగించ టానికి, బాజీ శత్రువును నిలవేశాడు. చిట్టచివరకు విశాలగఢ్ నుంచి ఫిరంగి గర్జనలు వినిపించాయి.





అప్పటికి శత్రువులు పూర్తిగా నిరాశ చెంది, వెనక్కు వెళ్ళిపోయారు. బాజీ ప్రభువు ప్రమాదకరంగా గాయపడ్డాడు. కాని అతను తన గాయాలను లక్ష్యపెట్ట లేదు. అతని ఆశయం నెరవేరింది. అతను చిరునవ్వుతో ప్రాణాలువిడిచాడు. కాని అతను శివాజీని రక్షించినవాడు గానూ, దేశభక్తుడుగానూ. వీరోచితంగా పాణాలర్పించినవాడుగానూ చరిత్రలో అమరుడు.

# కథా శీర్షిక పోటీ

## ఈ కథకు మంచి పేరు పెట్టి రు 25 లు గెలవండి!

?

ఇద్దరు రైతులు పక్క పక్కనే ఉన్న తమ పొలాలలో పంటపనులు చేసుకుంటూ, మధ్యాహ్నం ఇంటికి పోయే తీరిక లేక, తమ భోజనాలను పొలానికే తెప్పించుకుని తినేవాళ్ళు.

భోజనం చేస్తూండగా ఒక రైతుకు దగ్గుతెర వచ్చింది. ఎందుకు దగ్గుతున్నావని రెండో రైతు అడిగాడు.

"అది దగ్గు కాదు, పొలమారటం! నన్ను నా భార్య తలచుకుంటున్నది. అందుచేత పొలమారింది," అని మొదటివాడు చెప్పాడు.

తన భార్య తనను తలచుకోవటంలేదనీ, అందుకే తనకు పొలమారలేదనీ రెండో రైతుకు కోపం వచ్చింది. వాడు ఇంటికిపోయి, తన భార్యను తిట్టాడు.

"మధ్యాహ్నం నేను కునుకుతీశాను. అందుచేత నిన్ను తలచుకోలేదు. రేపు తప్పకుండా తలచుకుంటాను," అన్నది భార్య.

మర్నాడు ఆమె తన భర్త తినే భోజనంలో కారం దిట్టంగా వేసింది. భర్త దాన్ని నోట్లో పెట్టుకుంటూనే దగ్గటం ఆరంభించి, "మరీ అంత ఎక్కువగా తలచుకోకే, పాపిష్ఠిదానా!" అన్నాడు.

*　　　*　　　*

పై కథకు మంచి పేరు ఆలోచించి ఒక కార్డు మీద, మీ చిరునామాతోపాటు రాసి, "కథాశీర్షిక పోటీ", చందమామ, 2 & 3 ఆర్కాట్‌రోడ్డు, వడపళని, మద్రాసు 600 026 అన్న చిరునామాకు పంపండి.

కార్డులు మాకు నవంబరు 20 లోగా చేరాలి. అందులో ఫొటోవ్యాఖ్యలు చేర్చరాదు. ఫలితాలు, '77 జనవరి చందమామలో ప్రకటించబడతవి.

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1977 జనవరి సంచికలో ప్రకటింపబడును.



P. V. Subramanyam





Sambhu Mukherjee

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ నవంబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

## నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : బాధ్యత ఎక్కువ

రెండవ ఫోటో : బరువు తక్కువ

పంపినవారు : ఎస్. రవీంద్రనాథ్, కమలానగర్, అనంతపూరు.

బహుమతి మొత్తం రు. 25/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras 600 026 : Controlling Editor : NAGI REDDI

# జెమ్స్‌తో బలే మజా

**అదృష్టవంతులు గెలుపొందేందుకు 500 బహుమతులు**

అంతేగాక, అదనంగా భారీ బహుమతులను
గెలుచుకునే సదవకాశం!

వీటిలో ఏ అంకె లేదో చెప్పుకోండి చూద్దాం







**త్వరపడండి!** మీ జవాబుతోపాటు క్యాడ్‌బరిస్ జెమ్స్ యొక్క ఖాళీ ప్లాస్టిక్ పాకెట్ ఒకటి జతపరచి పంపండి. సరియైన జవాబు పంపిన మొదటి 500 మంది విజేతలకు రూ.11 విలువగల స్టేట్ బ్యాంక్ కానుక చెక్‌లు లభిస్తాయి. అంటే మీ ఆ కానుక చెక్ ద్వారా మరో భారీ బహుమతి—రూ.400—గెలుపొందే అవకాశం కూడా ఉంటుందన్నమాట—అదృష్టవంతులకు ఇది అదనంగా బోనస్ మరి!

మీ జవాబు, మీ పేరు, మీ చిరునామా కూడా ఇంగ్లీషులోనే పెద్ద అక్షరాలలో వ్రాయండి.
మీ ఎంట్రీలను ఈ క్రింది చిరునామాకు పంపండి.
"Fun with Gems" Dept. 22-E
Post Box No. 56, Thane 400 601.
ఎంట్రీలు గ్రహించబడేందుకు ఆఖరు తేది :
16-12-1976

## చాక్లెట్ మధ్యలో గలిగిన రంగురంగుల క్యాడ్‌బరిస్ జెమ్స్

CHAITRA-C-39 TEL

# నవ్వుల రుచుల రాజ్యం



## బ్రిటానియా
## బ్రిటా హై కౌంట్ బిస్కట్లు
## కేవలం రూ. 1/-కి బోలెడన్ని

బ్రిటానియా బిస్కట్లు అత్యుత్తమమైనవి

లింటాస్.BBC. 24-140 TL

